# పాండవోద్యోగము



గ్రంథకర్తలు:
రామనారాయణ కవులు.

ప్రకటనకర్త:
కందుల గోవిందం,
బెజవాడ, కృష్ణాజిల్లా.

మొదటి కూర్పు 1000 ప్రతులు

కాకినాడ:
స్కేప్ అండ్ కో., లో
ముద్రితము
1924.

 [వెల రు 0-12-0

# కనకతారానాటకము.

వెల రు. 1—4—0.

(గ్రంథకర్త : చందాల కేశవదాసుగారు)

ఇందు క్రూరసేనుని దుండగములు, కమలాదేవియొక్క విచారము, తారాకనకసేనుల పరితాపము, పల్లెవానియొక్క హాస్యరస సంభాషణ, కనకసేనుడుయొక్క కోర్టు చాలా అద్భుతముగా నుండును ఈనాటకము పేరుగొన్న నాటకసమాజములచే ప్రదర్శింపబడి వన్నెకెక్కినది. రసవంతమైన కీర్తనలతో నిండియుండును.

# అహల్యాశాపవిమోచనము.

వెల 0—12—0.

(గ్రంథకర్తలు : రామనారాయణకవులు)

లోకవిదితమగు నీపురాణకథ నాటకరూపమున చక్కగా వ్రాయబడినది, పద్యములన్నియు రత్నములే. సొగసైనపాటలు గలవు.

# శ్రీవిజయభాస్కరనాటకము.

వెం రు. 1—0—0.

(గ్రంథకర్త : జమ్ములమడ్క లక్ష్మీనృసింహంగారు)

భట్టి విక్రమార్కుని మనుమడు చరిత్రయంతయు నాటకముగా వ్రాయబడినది. విజయభాస్కరునియొక్క సాహసధైర్యౌదార్యములు నెరుంగదలచినచో ఈనాటకము తప్పక చదివి తీరవలయును. ఇందచ్చటచ్చట పార్సీ, కర్ణాటక మట్లుగూడా గలవు.

వలయువారు—

కందుల గోవిందం.

బెజవాడ.

శ్రీ

# పాండవోద్యోగము

గ్రంథకర్తలు.

రామనారాయణకవులు

ప్రకటనకర్త

కందుల గోవిందం

బెజవాడ.



మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

స్కేప్ అండు కో., కె. సుబ్బారాయుడు బ్రదర్సు వారిచే

ముద్రింపఁబడినది.

1924.



[వెల 0—12—0

# ఈ నాటకమున వచ్చుపాత్రలు

పురుషులు.

ధర్మరాజు
భీముడు
అర్జునుఁడు
నకులుఁడు
సహదేవుడు
ధృతరాష్ట్రుఁడు
సంజయుఁడు
దుర్యోధనుఁడు
భీష్ముఁడు
ద్రోణుఁడు
విదురుఁడు
కర్ణుఁడు
శ్రీకృష్ణుఁడు
శల్యుఁడు
దుశ్శాసనుఁడు

స్త్రీలు.

ద్రౌపది
కుంతీదేవి



# పాండవోద్యోగము

## ప్రథమాంకము.

రంగము:— [పటకుటీరమున శ్రీకృష్ణుఁడు నిద్రించుచుండును.
దుర్యోధనుఁడు—ప్రవేశించును.]

దుర్యో—(తనలో) ఔరా! పాండవులు ద్రౌపదీసమేతముగా విరటపురంబునఁ బ్రచ్ఛన్న వేషములతోనుండి యజ్ఞాతవాసదీక్షఁ బూర్తిఁజేసిరి. విరటుఁడు తనతనూజయగు నుత్తరను సౌభద్రునకొసంగి వివాహముగావించి, పాండవులతో వియ్యమందెను. అజ్ఞాతవాసమైనవెంటనే, వారికిట్టిశుభమొనఁగూడినది. (ఆలోచించి) ఇంతమాత్రమునకై నేను నిరుత్సాహమందనేల? ఎట్లయినను మాకును పాండవులకును యుద్ధము జరిగితీరును.

తే. గీ. హస్తినాపురరాజ్యంబు ♦ నందుమాకుఁ
బాలొసంగుడటంచును ♦ పాండుతనయు
లడుగవత్తురం చులకొడం ♦ బడను నేను
దానికై పోరుగల్గుట ♦ తథ్యమిలను.

(ఇంచుకయూరకుండి) వాసుదేవుఁడు నిద్రించుచున్నాఁడు. ఈతఁడు మేల్కొనిన పిదప, నేనువచ్చిన కార్యము దెలిపి, సత్వరముగఁ బోవలయును. మద్రనాయకుఁడగు శల్యుఁడు పాండవులఁ జూడ బయలుదేరినాఁడనివిని, యాతని నెట్లయిన నా పక్షమునకుఁ ద్రిప్పుకొనుటకు, నాతఁడు వచ్చుమార్గమధ్యమున, భోజనపానీయంబులకు గొఱంత లేకుండఁ జేసి, విశ్రమించుటకుఁ జలువపందిరుల వేయించితిని. త్వరగా నరిగి యాశల్యుని గలసికొనవలయును. (శ్రీకృష్ణునిఁ జూచి) ఈతఁడింకను నిద్రించుచునే యున్నవాఁడు

తే. గీ. వాసుదేవుండు పాండవ పక్షపాతి
సహజముగ; నందుచే వారు సమరమందు
సాయమొనరించుటను గూర్చి ప్రశయించు
నేమొయనుచు నేనును సంశయించుచుంటి.

ఇప్పుడీయనుమానమేల? ఈతఁడు మేల్కొనువఱకు నిచ్చట నాసీనుఁడనై యుందును.

(శ్రీకృష్ణుని తలవైపునఁ గూర్చుండును.)

(అర్జునుఁడు— ప్రవేశించును.)

అర్జు—(శ్రీకృష్ణునినుద్దేశించి—తనలో)

మ. ధరణీభారము బాపుమంచు సురబృందమెల్ల బ్రార్థింప, నీ
కరణిన్ యాదవవంశమందున రమాకాంతుండు కృష్ణుండుగా
వరలెన్ గాని, నిజంబుగా నితఁడు గోపాలుండె; యీదేవు, స
చ్చరణాంభోజసుసేవ, భక్తులకు మోక్షశ్రీ బ్రసాదింపదే.

మేమింతవఱకును నెట్టియాపదలను బొందకుండ, వనవాసాజ్ఞాతముల దీర్చుట, యిమ్మహానుభావుని కృపచేత నేకదా! (దుర్యోధనునిఁ జూచి తనలో) ఇదిగో! దుర్యోధనుఁడెందులకో వచ్చియుండెను. (ఇంచుకయూ

రకుండి) ఇమ్మహానుభావుఁడు మేల్కొనువఱకును పాదసన్నిధి నాసీనుఁ
డనై యుండును. (పాదములదెసఁగూర్చుండును.)

—(మేల్కొని-తనలో) రణంబున నాసహాయమువాంఛించియీ దుర్యోధనార్జునులు వచ్చియున్నారు. ఇరువురునువచ్చినారు కావున నిరువురకును సహాయముజేయవలయును. కాని, పార్థుని యందు నాకు వాత్సల్యమధికమగుటంజేసి, యతనికొనర్చుమహోపకార మమూల్యమై యుండవలయును. (శయ్యాతలమునుండి లేచి యర్జునునిఁజూచి) అర్జునా! నీవువచ్చియెంతసేపైనది. పాపము! నాకై నిరీక్షించుచుంటివి కాబోలు! (దుర్యోధనునిఁజూచి) ఓహో! కౌరవేంద్రా! నీవుగూఁడవచ్చితివా? (ఇంచుక యూరకుండి) మీయిరువురిరాకకుఁ గారణంబెఱుంగవచ్చునే!

అర్జు—

తే. గీ. నిఖిలభువనముల్ కుక్షిలో నిలుపుకొన్న
నీవుమారాకకునుగతం బెఱుఁగకుందు
వే? యెఱిఁగియుమాచేత నే వినఁగఁగోరి
పల్కితివిగాక యీరీతిఁ బద్మనాభ.

మాధవా! కౌరవులు మాకునిర్ణయించినవనవాసాజ్ఞాతములఁ దీర్చితిమి. ఇఁక మాయర్థరాజ్యభాగవిషయమై వారితో రణమొదవునేమోయని తోచుచున్నది. అట్టిదిసంభవించునేని నీసహాయము గోరవచ్చితిని.

దుర్యో—వాసుదేవా! నేనును నట్టియుద్దేశముతోడనే వచ్చితిని.

శ్రీకృ—దుర్యోధనా! నిక్కముగానీవు నన్నుఁజూచుటకు ముందరుదెంచితివి. కాని నేనుమాత్రము ముందర్జునునిఁజూచితిని. మీయిరువురును నాకుసమానులే. నాతోడసమానులగు యోధులుపదివేవురు గోపాలురుగలరు. నేనొకపక్షముననుందును. వారొకపక్షముననుందురు. నేనేపక్షమున నున్నను రణంబాచరింపను.

ఇందుమీయిరువురు మీయిచ్ఛవచ్చినట్లు గోరుకొనుఁడు. ముందర్జునుఁడు నాకుఁగానిపించెఁ గావున, నాతఁడుముందుగాఁగోరుకొనును.

దుర్యో—(తనలో) మొత్తముమీఁద పక్షపాతముకొంత కనఁబఱచినాఁడు. రణమాచరింపని కృష్ణునితో నేమిప్రయోజనముండును.

అర్జు—మధుసూదనా! నీవుమాపక్షముననుండవలయునని మాప్రార్థన.

దుర్యో—(తనలో) ఈతనికోరిక నాకనుకూలముగనున్నది. (ప్రకాశముగా) వాసుదేవా! నీవువచించినట్లు గోపాలబలమును నాకు సహాయముగనిమ్ము.

శ్రీకృ—నీకోరిక ననుసరించెదఁగాక!

దుర్యో—కృష్ణా! వలసినప్పుడు వార్తఁబంపెద. ఇఁక నాకనుజ్ఞనిమ్ము. పోయివచ్చెద.

శ్రీకృ—మంచిది.

దుర్యో—(నిష్క్రమించును.)

శ్రీకృ—అర్జునా! రణంబున నిరాయుధవ్యాపారుఁడనై మెలఁగునావలన నీకుఁబ్రయోజనమేమి యున్నది?

అర్జు—ముకుందా! నీవుయుద్ధము సేయవలయునా? దేవా! నీవుసామాన్యుఁడవా?

ఉ. కోవిదరక్షణంబు, మఱి కుత్సితశిక్షణ మాచరింపఁగా
నీవునరుండవై చనవ నీస్థలినవ్వసుదేవదేవకీ
దేవులకుఁ జనించితివి దేవ! త్వదీయమహాత్మ్యమెంగనన్
దేవతలైనశక్తులె సుధీజనవందిత నందనందనా.

మహానుభావా! నీవుసాక్షాద్విష్ణుఁడవు. నీవెక్కడనుందువో యక్కడజయంబగును. నీకెదిరినిల్చుటకు బ్రహ్మాదులకైనను తరముగాదు. నీవు

యుద్ధము జేయుదువని నేనుతలంపలేదు. నాయభీష్టము మఱియొకవిధ
ముననున్నది.

తే. గీ. సమరరంగంబునందునీ వు సారథిగను
జేసికొని కౌరవులగెల్చి వారిఁగాంతు
గరుణబూని నారథమును గడపుమంచు
నిన్నుఁబ్రార్థింతు, ఖలశిక్ష నీరజాక్ష.

ఈకోరికఁదీర్పుము. ఇట్టి కార్యమునందు నిన్ను నియోగింపఁదలఁచిన నీపా
దసేవకుఁడనగు నన్ను మన్నింపుము.

తే. గీ. గురుఁడవు బరమహితుఁడవు గోర్కెదీర్చు
దేవుఁడవు, మఱందివగుట భావమందు
వెరపుబూనక కోరితి విశ్వవంద్య
కరుణఁబూనుచు రక్షింపు కమలనాభ

శ్రీకృ—ధనంజయా!

మ. ధరణీభాగము మీకుఁ గౌరవులు తత్పక్షంబొప్పగా నీరు నెం
చరు; మీరున్ సహాయంబు, రంగులకునై జన్యంబు గాటిల్లు; నే
డురమందున్ రథసారథిత్వమును సంతోషంబుగా బూని, సి
కరయున్ గూర్తు జయంబు సాదియముఁ కేలా! పాండురాజాత్మజా

అర్జు—మహాప్రసాదము.

శ్రీకృ—ఇఁకరమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము:—ధర్మరాజు—శల్యుఁడు—ప్రవేశము.

శల్యు— (తనలో) ధర్మసంధులగు పాండవులనువిడిచి దుర్యోధనుఁడు
పన్ని నతంత్రమునఁదు జిక్కి, కౌరవులకు రణమున సహాయము
సేయవలసివచ్చెనుగదా.

ధర్మ—మామా! మద్రేశ్వరా! మేనల్లుండ్రయందు గరుణవహించి చూడవచ్చిన నీకనేకవందనము లాచరించుచున్నాను. నిన్నుఁ జూచి యెన్ని యోవత్సరములైనదికదా!

తే. గీ. కౌరవులు బెట్టు నాకడ గండ్లకోర్చి
చేసినప్రతిజ్ఞఁ జెల్లించి చేరినాము
కడుసుఖంబుగ నిటకు నీ కరుణవలన
ధర్మదేవతకరుణచే తనుక్షితీంద్ర.

శల్య—

మ. గురుఁడై మేనమఱందియై సఖుఁడునై కొండంత చుట్టంబునై
పరమామోదము మీఱ మిమ్ములఁ గృపా పాథోధియై యెప్పుడున్
బరిరక్షించెడు కృష్ణుఁ డుండఁగఁ గొఱం తల్ గల్గునే ధాత్రిధ
ర్మరతిన్ గాలము బుచ్చుమీ కెదఁ దలం పన్ రాజచూడామణీ.

కాని, కాలమహిమ మాత్రము బాగుగ లేదు. ధర్మసంధులకే యిక్కట్లు కలుగుచుండును. మాయదురోదరంబున సకలరాజ్యశ్రీలను గెల్చి కౌరవులు మిమ్ము వనవాసాజ్ఞాతవాసంబులు సేయఁబంప, ధర్మపాశబద్ధులై, ప్రతినఁ జెల్లించివచ్చిన మిమ్ముఁ జూడఁగంటిని. నాయానందమునకు మేర లేకయున్నది. కాని, యొక్క విషయమున మాత్రము మిమ్ముఁ జూచుటకు సిగ్గుగ నేయున్నది.

ధర్మ—మాతులా! నిరంతరము మా శ్రేయము నభిలషించు నీవిట్లు పలికెద వేల?

శల్య—యుధిష్ఠిరా! ఏమని చెప్పుదును. మిమ్ముఁ జూచుటకు నేను వచ్చుచుండ, దుర్యోధనుఁడు మార్గమధ్యమున విశ్రాంతి సదనములనిర్మింపఁ జేసి, నాకును, నా పరిజనమునకును భోజనాదిసదుపాయములఁ గూర్చి, యాతఁ డందందు దిరుగుచుండెను.

ధర్మ—నీయందుండు నభిమానముచే సుయోధనుఁడట్టి గౌరవము జేసి నాఁడు. అట్టిమర్యాదఁబొందుటకీవర్హుండవు.

శల్యు—అతఁడా గౌరవమునుదుస్స్వభావమునఁ జేసెను. ఆతఁడునిర్మించిన విశ్రాంతిగృహములు మొదలగునవి చూచి యద్భుతమంది యచ్చటనున్న పరిచారకునివిలోకించి "ఓయీ! ఈయరణ్యమధ్యమున నిట్టివసతిఁగల్పించిన మహాదాత యెవరు? అతనికేది కావలసినను నొసంగుటకేను సంసిద్ధుఁడనని పలికితిని. ఆసమయమున నాకుఁగనఁబడకుండనచ్చటదిరుగుచున్న సుయోధనుడు నాయెదుటకరుదెంచి, " మామా! ఈప్రయత్నమంతయు నీకొఱకే నేను గావించితి ననిపలికెను. అంతట నేనాతనిని విలోకించి నీకునావలనఁగావలసిన కార్యమేమని పలికితిని.

ధర్మ—మామా! ఆతఁడునీవలన నేదియో వరముగ్రహించుటకట్లు చేసియుండును.

శల్యు—నేచెప్పఁబోవువాక్యములనువినుము. అతఁడునన్నుఁజూచి జరుగనున్న కురుపాండవసమరముననీవు నాపక్షముననుండవలయునని పలికెను. అప్పుడు నేనుచేయఁగలిగినదేమున్నది.

తే. గీ. నన్ను వంచింపఁగౌరవ నాథుఁడట్లొ
నర్చుటగ్రహింప లేక, మ నంబునందు
ముదమునందిపల్కినవాక్య ములకు, నకట
వానిపక్షమునందుని ల్వంగవలసె.

ధర్మనందనా! ఈసంగతిమీకుఁదెలుపుటకెంతయువిచారముగనున్నది. ధర్మపథానువర్తనులను విడిచి చేసినవాగ్దత్తమునకు బద్ధుఁడనై దుష్టులపక్షముననిలిచి మీతో యుద్ధముసేయవలసివచ్చెనుగదా.

ధర్మ—మహాత్మా! ఇచ్చినవరముననుసరించి, మీరాతనికట్లుమేలు గూర్పఁదలంచుట నాకుఁబరమానందము. ఇట్లుసేయుట నీసద్గు

ణము వెల్లడిసేయును. ఆశ్రితపక్షపాతివగు నీకే జెల్లును. కాని నిన్ను నేనొక్క సహాయముఁ గోరెదను. నాయందుఁ గరుణింపుము. రణమునను విజయునకు గోపాలదేవుఁడు సారథ్యమొనరించును. కృష్ణునితో సమానముగ రథముఁ గడపు సామర్థ్యము మీకుఁ దప్ప మఱెవ్వరికిని లేదు. ఆ కారణమున రణమున కర్ణసారథ్యము దప్పక పూన్పఁబడును. ఆసమయమునఁ గర్ణునిచిత్తముఁ గలంచి, ధైర్యముఁ దొలఁగించి గాండీవినిఁ గాపాడవలయును. ఇదియే నా విన్నపము. ధర్మమూర్తివి. మాకు మాతులుండవు. అందుచే చనువున సాహసించి యిట్లడిగినందులకు మన్నింపుము—

శల్యు—ధర్మనందనా!

చ. సమరమునన్ సుయోధనుఁడు సారథిగా ననుఁ బంచెనేని, నీ
దుమదికి సంతసం బొదవ తోయజమిత్రకుమారు మేటిచి
త్తమును గలంచి వైచి, ఘన ధైర్యముఁ గోల్పడఁజేసి, కాచెదన్
విమలమతిన్ ధనంజయుని విను దిసందియమందఁ బోకుమా.

ధర్మ—మామా! సదయుఁడ వుండ మాకుఁ గొఱత కలుగునా! (ఇంచుక యూరకుండి) స్నానమునకు వేళయైనది. లెమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.





# పాండవోద్యోగము

## ద్వితీయాంకము.

రంగము:—(ఉపప్లావ్యమున—పాండవులు—శ్రీకృష్ణుఁడు—
సంజయుఁడు—ప్రవేశించుచున్నారు)

సంజ—(తనలో) జగన్నాటకసూత్రధారియగు కంసధ్వంసి యిచ్చటనే యున్నవాఁడు. నిరంతరము గంటిని రెప్పచందంబున నీతఁడు పాండవులఁగాచుచుండ వారికెట్టికొఱంతయైన నొదవునా? (ఇంచుక యూరకుండి) నాదూతకార్యమును నేనుకడుజాగరూకతతో నిర్వహించుకొనవలయును.

ధర్మ—(సంజయునిఁజూచి) సంజయా! నిన్నటిదినంబున తొందరచేఁ గుశలప్రశ్నంబులు సంపూర్తిగ నడుగనైతిని.

సీ. ఆనందమే కదా ॥ యాంబికేయునకు సౌ
ఖ్యమెగదా భవ్యగాం ॥ గాసుతునకు
కుశలమే కద నీతి ॥ కోవిదుఁడౌ విదు,
రునకు భద్రమె కదా ॥ యనుజయుక్తుఁ
డౌసుయోధనునకు ॥ నతిముదంబే కదా,
ద్రోణునకుఁ గృపునకు ॥ తోడశుభమె

ధార్తరాష్ట్రాగ్రజు ♦ తరుణీలలామకు
సాధ్వీగాంధారికి ♦ సౌఖ్యమొకద
తే. గీ. మంత్రిబృందంబు కెల్లక్షే ♦ మంబె, సైంధ
వాదిబంధువర్గమునకు ♦ నతిముదంబె
హితపురోహితాదులకును ♦ సతతసుఖమె
సంజయా! వచియింపుమా ♦ సంతసింతు.

సంజ—ధర్మనందనా! మీ పెదతండ్రియగు ధృతరాష్ట్రునకును దల్లియగు గాంధారికిని క్షేమమే. తక్కినవారందఱును గుశలముగ నేయుండిరి. (ఇంచుకయూరకుండి)

మ. ధృతరాష్ట్రాత్మజులెన్ని యొగ్గులనున ♦ ర్థిఁగూరాకు, గావించినన్
మతినూహింపక వానినిన్ మఱచి ధ ♦ ర్మంబున్ బ్రతిష్ఠింపఁగా
క్షితిరాజ్యంబునువీడి భీకరవన ♦ శ్రేణిన్ నివాసంబు జే
సితగన్ వచ్చిననిన్ను నెన్నగుణరా ♦ సీ! మానసునన్ శక్యమే.

దురోదరంబున రాజ్యశ్రీలనోడి మీరువనవాసమునకుఁబోవుచున్నపుడు మిమ్మనుతింపనిమానవుఁడొక్కఁడును లేఁడు. పాండవులు బలపరాక్రమవంతులయ్యును ధర్మపాశబద్ధులై శాంతమువహించిరని ప్రజలాడుకొనిరి—

భీము—(తనలో) ఈతఁడు మమ్ముశ్లాఘింపఁబ్రారంభించినాఁడు.

శ్రీకృ—సంజయా! పాండవులధర్మసంధతలోకమున కిదివరకే విదితమైయున్నది. ఇప్పుడు మనము వేఱె యుగ్గడింపనవసరములేదు. నీసందేశమువినుటకు యుధిష్ఠిరునిడెందము తొందరపడుచున్నది.

సంజ—(ధర్మరాజునుజూచి) ధర్మనందనా! నేను ధృతరాష్ట్రమహీపాలుని యాజ్ఞననుసరించి యిచ్చోటి కరుదెంచితిని.

ఉ. ఆవిధిఁ జేసినట్టి శపథార్థము, సర్వనృపాలకోటి, సం
భావన సేయ మీరు వనవాసము జేసి సుఖంబుగా నిటన్
శ్రీ విలసిల్ల జేరిరని చిత్తమునన్ ముదమందుచుండె ధా
త్రీవిభుఁ డాంబికేయుఁడు సుధీరుఁడు, ధర్మనృపాలశేఖరా.

అభిమన్యుని వివాహము మొదలగునవి విని యాతఁడందిన యానందమునకు మేర లేదు. ధర్మసంధు లేపరిదేశములనున్నను నట్లే మంగళంబు లొందవుచుండునని యతఁడు తలంచెను.

శ్రీకృ — మీ ధృతరాష్ట్రుని హృదయము నవనీతమువంటిదగుటచే నాతఁడట్లు తలంచుచుండును. ఇప్పుడా సంగతియంతయు నేల? ఎవరి హృదయ మెట్లున్నదో మేమెఱుఁగక పోలేదు. నీవు వచ్చిన కార్యము ధర్మనందనున కెఱింగింపుము.

సంజ — దేవా! యుధిష్ఠిరా! తులసీవనంబున గంజాయి మొలకవోలె, యశమున కాకరమైన మీ భరతకులంబున దుర్యోధనుఁడు జనించినాఁడు. ఆతని మూలమునఁ గలుగుచున్న దుష్కీర్తినిఁ బాప నీవ, సమర్థుఁడవు.

శ్రీకృ — ఒకరి మూలమున వచ్చిన దుష్కీర్తినిఁ బాపుటకు మఱియొకరు సమర్థులెట్లగుదురు? నీవు పలికిన మాట వింతగనున్నది.

శా. వచ్చిన దుర్యశం బెటులో వచ్చెను, వచ్చిన దాని బాప, నీ
సచ్చరితుండు తానెటులు శక్తుఁడగున్ విను, కౌరవేంద్రుఁడే
చచ్చినఁ గాని పోవదది సందియ మింతయు లేదు దీనికిన్
నచ్చని మాటలేటికివి నన్ వచియింతువు నీవు సంజయా.

నిశ్చయముగా దుర్యోధనుని మూలమున నెవ్వరికెన్ని యిక్కట్లు ప్రాప్తించుచున్నవో నీవు మాత్రమెఱుఁగకుంటివా? తనకుఁ దోఁచదు. పెద్దలు చెప్పినది వినఁడు. కాకున్నచో,

ఉ. సూరిజనానుకూలురవి శుద్ధయశస్కులు పాండుపుత్రకుల్
కారణమింత లేకఘన కష్టములందుచు గానసంబులన్
గౌరవనాథుమూలమునఁ గాదె! వసింపఁగఁ గల్గినారు, నీ
వారయకుంటివాయది, గుణాఢ్యు లెఱుంగరె తెల్పు సంజయా

సంజ—దేవా! గతించినదానినిప్పుడు మరలఁదలఁప నేల. (ధర్మరాజునుజూచి) ధర్మనందనా! ఏది యెట్లున్నను కలహము త్తమకార్యము కాదని నేను వక్కాణింతును. రణమున జయాపజయములు దైవాధీనములు.

ధర్మ—సంజయా! నీవు చెప్పినట్లు కలహమొదవకుండ గార్యము చక్కబడెనేని యంతకన్న కావలసినదేమున్నది. ఇంతకును మాయర్ధరాజ్యము మాకిచ్చిరేని, పోరాటమేల సంభవించును? అప్పుడు మాయందుఁ (కుటిలబుద్ధి నవలంబించిన మా పెదతండ్రి) యిప్పుడు మా సేమమారసిరమ్మని నిన్నుఁ బంపినందుల కెంతయు సంతసించితిని మాయాదురోదరమున సర్వమును గోలుపుచ్చి మమ్మడవులకు నడపిన కౌరవులచరిత్రము నీకు మాత్రము తెలియదా! ఇఁక ధృతరాష్ట్రుని సంగతిఁ జెప్పెదము! మాయజూదపు సిరికాసపడవలదని సకలధర్మాధర్మవిమర్శకు విదురుండెంత చెప్పినను వినక దుర్యోధనుని కుటిలవాక్యములవిని మా కెగ్గుసలిపె. ఇప్పుడైనను మా పెదతండ్రి దుర్యోధనుఁడెట్లు చెప్పిన నట్లే వర్తించును గాని ధర్మమార్గమునఁ జనఁడు. యుద్ధము లేకుండ నుండిన బాగుండునని నీవు పలికితివిగాని యట్లు జరుగునని చెప్పఁజాలను.

సంజ—దేవా! సంగరమువలన ననేకకష్టములొదవును. మీ రెండుపక్షములయందు మహావీరులేయుండిరి. మీపక్షముననున్న సాత్యకివిరాటద్రుపదులు సమరంబునకుఁ దలపడిరేని చతుర్దశభు

వనంబులు వేర్కొనిడిజయింతురు. భీమార్జునులశౌర్యపరాక్రమము వర్ణింప నెవ్వరితరము? వీరినటుంచుము భగవంతుఁడగు వాసుదేవునిబలము మీకుఁ బెట్టనికోటయైయున్నది ఇఁక కౌరవపక్షమునను్న భీష్మద్రోణాశ్వత్థామకర్ణశల్యబాహ్లీకసోమదత్తప్రముఖులను సంగరంబున నెదుర్కొని జయము వడయువారెవరు? (ఇంచుకయూరకుండి) ధర్మనందనా! నీవు రెండుపక్షముల హితమునుగోరి వర్తింపుము.

ధర్మ—సంజయా! నీవు నుడివి తెలుంగునఁ గలహముసంభవింపకుండ మాకు రాజ్యము లభించినచో యంతకంటెను గావలసిన భాగ్యమేమున్నది. కాని యట్లది ప్రాప్తించునని మేము తలంపము.

ఉ. ఎందఱు చావకుండుటటి ? యెందఱు శోకమునందకుండ, నిం
కెందఱు యుద్ధమేలమన ? కీర్తియనంచును బాఱకుండ, నా
పందను యోధనుండనుకొను ? పాపసుఁ డక్కట మాకు నద్ధరా
జ్యేందిరఁగూర్చునే సుగుణ ? శేఖరులెల్లరు సమ్మతింపఁగన్.

సంజయా! ముందు మమ్ము బొగడి, పిదప మాపక్షమునయున్న భీష్మాదులను గెల్చుట యసాధ్యమని వర్ణించితివి. ఈవాక్యములకు మాత్రము మేము సమ్మతింపము. నీవు పక్షపాతబుద్ధి నిట్లువర్ణించితివి. మాపక్షమునయున్న వీరులు సామాన్యులని యూహించితివా యేమి? భీముఁడును, సంక్రందననందనుండును, గవలును రణముఖంబున నిల్చిరేని, కౌరవులేగాక పురహరుండైనను గెల్వఁగలఁడా? కౌరవులను మేముగెల్వలేమని మాత్రము నీవు తలంపవలదు వారు మాకుఁగీడొనరింపనవసరములేదు. మేము వారికిఁ గీడొనరింపనవసరములేదు. బాంధవ్యము వృద్ధిఁబొందఁదలఁచెనేని ప్రజలెల్లరు సమ్మదమొంద, ధృతరా

ష్ట్రుఁడు కొడుకులకు బుద్ధిఁజెప్పి మమ్ము బిలిపించి మాయర్ధరాజ్యము మాకొసంగుట మేలు.

సంజ — దేవా! నా పలుకులయందే విధమయిన దోషమున్న క్షమింపఁగోరెదను. నీచరిత్రము లోకసన్నుతిఁగాంచినది కాని సామాన్యమైనది కాదు. ఒకవేళ యాత్మవినాశముకోరి ధార్తరాష్ట్రులు పాలీయకపోయినను, నీవు రణంబునకుఁ గడంగవని తలంచెదను. సంగరమొనర్చి, రుధిరాన్నము దినుటకంటె, భిక్షాన్నమే మేలని నీవు తలంతువు. నీవు రాజసూయమహాధ్వరమొనర్చి సకలభూసురులను దృప్తిఁబొందించిన ధన్యుఁడవు. నీకీర్తిలతలు సకల దిగంతములఁ బ్రాకియున్నవి. అట్టి నీవు జ్ఞాతివధమునకుఁ దొడంగుట యెంతయు నింద్యమని నేను చెప్ప సాహసించుచున్నాను.

భీము — సంజయునిఁజూచి)

ఉ. కౌరవులర్ధరాజ్యమొస । గ౯ మదిలోపల నెంచకుంటినన్
ఘోరరణంబులోనరి । కోటినిద్రుంపఁదలంపకుండనే
తీరుననైన మీరుకడు । ధీరతఁబూనిచరింపనౌనటం
చారయఁబల్కఁబోవఁగఁగ । దా! యిటువచ్చితివీవు సంజయా.

నీవు చెప్పఁదలంచిన సందేశమిదియే కాఁబోలు ధృతరాష్ట్రుఁడట్లు పలుకుమని చెప్పెనా యేమి? (ఇంచుక యూరకుండి) అట్లయియుండును. కాకున్నచో

చ. కురుసభలోన నామ్రిపక । కూఁతురు కోకలు విప్పి కౌరవుల్
పరిభవము౯ బొనర్చునెడ । భావమునందణుమాత్రమైన, స
త్కరుణవహించి, యావిధిన । కార్యముసేయుట యొప్పదంచుదు
శ్చరితులకు౯ వచింపఁగదు । జాలినియంధుఁడు రాజ్యమిచ్చునే.

ధర. సంజయా! కుఁటుంబసులను, గూర్తిరులను వధించుట ధర్మ

శాస్త్రానుకూలమే. రణము క్షత్రియులకు ముఖ్యధర్మమై
యున్నది.

శ్రీకృ—సంజయా!

ఉ. తమ్మునిపుత్రులంచును, ము దమ్మునసాకక, కోలుపుచ్చి రా
జ్యమ్మును, గానకంపి, యగ చాట్లను బొందగఁ జేసి, యిప్డు నీ
మమ్మును జూచిరమ్మనుచు మాన్యునివోలెను నిన్నుఁబంపెఁగా
ర్యమ్ము తెలుంగుఁజూచి ధృత రాష్ట్రుఁడు సంతసమయ్యె సంజయా.

ధృతరాష్ట్రుఁడు నిన్నుఁ బంపినందులకును, నీవు ధర్మనందనునకు శాం
తిఁబొందు తెలుంగు చెప్పినందులకునుఁ గూడ నాకు మోద మొదవినది,
అదిగో వైకుంఠమని రాజ్యమొసంగక యరచేయిఁ జూపినంత మాత్రము
ననే ధర్మసంభవుఁడు సంతసించునా? కౌరవులచేమితిమీఱిన పరాభ
వమందిన యీపాండునందనులర్ధరాజ్యము గైకొనకుండ శాంతము వ
హించి యూరకుందురా! వీరంతటి పరాక్రమహీనులా! సంగరమొన
ర్చి యశమందుట రాజులకుత్తమధర్మము కాదా! బాల్యమాదిగ నెవ్వరు
దుశ్చరితులై యుండిరో నీవెఱుఁగవా? మదోన్మత్తులయిన కౌరవులే
వీరికెపుడును నెగ్గుసేయఁదలఁచుచుందురు. ఆనాఁడు నిండుకొల్వులో ద్రు
పదపుత్రికకు జరిగిన పరాభవము వారింపఁజాలని మీ ధృతరాష్ట్రుఁడి
ప్పుడు పాండవుల క్షేమమారసిరమ్మని పంపుట జూడ మిగుల వింతగను
న్నది. ఆనాఁడు పాండవులవమానింపఁబడినను, శాంతచిత్తులై ధర్మబ
ద్ధులై యూరకుండిరిగాని లేనిచో రిపుసంహారమున కొకనిమిషకాల
మయినను పట్టదు. దుశ్శాసనదుర్యోధనులొనర్చిన దుష్కృత్యములు
వీరిహృదయమున బాగుగ నాటియున్నవి. కౌరవు లర్ధరాజ్యము వీరికొ
సంగుదురేని సంతసించెద. లేకున్నచోఁ గయ్యమునకుఁ గడంగుటయే
యుధిష్ఠిరునియభిప్రాయమని నేను గట్టిగఁ జెప్పఁగలను, అయినను ఈ

విషయమై నేను కౌరవుల హృదయమెఱింగి తగు విధమున సంధినడపు భారము వహించి నేఁడో రేపో హస్తినాపురమునకరుదెంతును.

సంజ—దేవా! భగవంతుఁడవగు నీవు స్వయముగ సంధికార్యభారమువహించి యరుదెంతునని చెప్పినందులకెంతయు సంతసంబయ్యె. నీవు తలంచిన కార్యముకొనసాగకయుండునా (ధర్మరాజునుజూచి) ధర్మనందనా! సృష్టిస్థితిలయకారణభూతుఁడగు వాసుదేవుఁడు స్వయముగహస్తిపురమున కరుదెంతుననిపలికె. అట్టియెడ కార్యము నెఱవేరుటకేమియు సందియములేదు. ఇఁక నాకేమి సెలవిచ్చెదవు?

ధర్మ—సంజయా! కౌరవపక్షముననున్న వీరులెంతటి బలపరాక్రమవంతులైనను వారుమమ్ము గెల్చుట దుస్తరము. ధర్మదేవత మాకు నిరంతము సహాయము సేయుచుండును. ఇదియుఁగాక లీలామానుషవిగ్రహుండగు గోవిందునియనుగ్రహము మాకుఁ బెట్టనికోట ఇట్లున్నను కలహవాంఛ నామనంబున లేదు. వారి పాలువారుదీసికొని మాపాలుమాకొసంగిరేని యుందఱముగలసిమెలసిసుఖింపవలయుననియె నాకోరిక. సగపాలీయకసమ్మతింపరేని తుదకు వారుమాకు సంతోషపూర్వకముగ కుశస్థలము వృకస్థలము మాకంది, వారణావతము నింద్రప్రస్థము ననునీయైదుపురములునొసగినఁ జాలును.

శ్రీకృ—సంజయా! నావచనంబులుగ ధృతరాష్ట్రమహీపాలునకిట్లు వచింపుము.

సీ. చేయుఁడీభూసుర । శ్రేష్ఠులకును దాన,
ధర్మముల్ వేడ్కతోఁ । దనివితీర
ననుభవింపుఁడిముదం । బారవలసినట్టి,
దివ్యభోగంబులఁ । దృప్తితీర

గౌరవింపుఁడిమీరు । కాంతామణీతతి,
యుల్లంబులుమిగుల । పల్లవింప
సత్కరింపుఁడిభట । సంతతినిఁగవుల,
నాశ్రితులహితుల । నతిముదమున

తే. గీ. బిదపనఱచేతఁబ్రాణముల్ । బెట్టికొనుచు
సంగరస్థలంబునుజొచ్చి । శత్రుతతిని
దాకి, విజయంబుగాంచుటో । ధరణిబహుళో
వేఁగ సేయంగఁదగుమీకు । వీరులార.

ఆనాఁడు పాంచాలరాజతనూజను మీరునిండుకొలువునఁ బరాభవించు నప్పుడా సాధ్వీశిరోమణి నన్నుఁగావుమని వేడుకొనుట నాహృదయం బునఁ దగిలియున్నది.

సంజ—(తనలో) ఈవాసుదేవుని వచనము లతితీవ్రముగనున్నవి (ప్రకాశముగా)

తే. గీ. జగములెల్లను బాలించు । శాసకుఁడవు
నీవెఱుంగనివిషయంబు । లెందుఁగలవు
నీవుతలఁచినదానికి । నేరికడుఁ
బడగశక్తిగల్గునునవ । పంకజాక్ష.

అర్జు—సంజయా! ధర్మనందనుఁడు చెప్పినపలుకులును, భగవంతుండగు వాసుదేవుని వాక్యములను వింటివి. ఇఁక నాపలుకులుగూడ కౌరవులకుఁ దెలుపుము. ధర్మపాశబద్ధులమై మేము శపథముఁ దీర్చి వచ్చిన పిదపమాయర్ధరాజ్యము మీరు సంతోషపూర్వకముగా నొసంగితీరవలయును. అట్లీయకుండుట సంతసమే ఇదివరకు మీరు చేసిన దుష్కార్యముల కిదిమకుటంబవన్నె పెట్టినట్లగును.

తే. గీ. భయదసంగరభూమిలోఁ బలుగురుకు
మాధవుఁడుగూలిననుగాని మహితధర్మ
మూర్తిధర్మజుఁడువిపిన భూములందు
బడినశ్రమతీరదంచును బలుకుమయ్య.

నీతికోవిదా! సంజయా!

మ. గదచేతంగొనిభీమసేనుఁడు మహా కాలాంతకుండోయనన్
గదనంబందుననిల్చివైరిచయమున్ ఖండించుచోఁగాంచి, దు
ర్మదుఁడాకౌరవభర్తభీతిఁగొని, మా ర్గంబేదియుఁ లేక, క
ష్టదశంగూలి, యొసంగు మాకపుడు రా జ్యంబందుభాగంబునున్.

శుష్కవనముపైఁ బడుదావాగ్నిచందమున యుధిష్ఠిరుఁడు రిపుసేనపైఁ బడినప్పుడుగాని వారు మమ్ము సరకుగొనరు. ఆఁకటితోనున్న వ్యాఘ్రములు కురంగపంక్తిపైఁ బడుతెఱంగున నకులసహదేవాభిమన్యాదులు మీసేనను వేటాడునప్పుడు మీరు మమ్ము సరకుగొందురు. ద్రుపద విరాటలు సబాణబాణాసనతూణీరులై యాహవమున మీ పసదూల్చునప్పుడుగాని, మీరు మాకు వెఱవరు.

మ. వరగాండీవము, నగ్నిదత్తరథము శ్వశ్రేయున్ వీరవా
నరసాధ్వజముఁ జెలంగగనుజం డారాతిదోర్దర్పసం
హరణాసక్తిని బూని నేను వెసను గ్రాజిం బ్రవేశించినన్
కురునాథుండపు డర్ధరాజ్యమును మా కుంగూర్చుభీతాత్ముఁడై.

ఇప్పుడు మీసుయోధనుఁడు భగవంతుఁడగు వాసుదేవునే లక్ష్యము సేయక యున్నవాఁడు. అట్టియెడల మమ్ము సరకు గొనునా? మేము భీష్మద్రోణాదివృద్ధులకు నమస్కరించి మాయర్ధరాజ్యమునకై మీతో నమరమొనర్చెదము. సాక్షాత్ శ్రీమన్నారాయణుఁడగు కృష్ణుఁడు మాపక్షమున నుండుటచే మాకు జయమవశ్యము కలుగును ఇదియుంగాక,

తే. గీ. జయమొ? యపజయమొ! యిపుడా ♦ జాడయేల
రణముసేయుటయొ౯త్రిధ ♦ ర్మంబెయగుట
దాని దీర్పెదమూపైన ♦ దైవముండు
సంజయా! దీనికింక నేల ♦ సందియంబు

భీము—సంజయా? ఆనాఁడు ద్రౌపదిని నిండు కొలువున పరాభవించు నప్పుడీ వాయునందనమృగేంద్రము ధర్మనందన ధర్మపత్ర శృంఖలములచే బంధింపఁబడియుండెను. ఇఁకనట్టి యాటంకమేమియు లేదు. ఇఁకనన్ను వారించుటకు దేవతలకైనను దరముగాదు పరాక్రమరసాధిదేవత మాయందు మూర్తీభవించియున్నది. అయ్యది మమ్మెన్నటికిని విడుచునది కాదు.

చ. కవలిరువంకలన్ నడువ ♦ గావిజయుండును నేగుదేర, నా
హావతలమందుఁ జొచ్చియమ ♦ రౌఘముమెచ్చినుతించునట్లుకౌ
రవులనడంచిపుచ్చి, కురు ♦ రాజ్యరమావనితాలలామకున్
ధవునిగఁ జేతుధర్మజుని ♦ దప్పకమద్బలవిక్రమంబునన్

నకు—సంజయా! ఇంక వారు మాకుమాటలచే రాజ్యమిచ్చునట్లు శోచదు, మేమును సమరము నందే కృతనిశ్చయులమై యుంటిమి. కాలవ్యాళంబుల బోలుమాకృపాణములు వైరి శిరచ్ఛేదనమునకై తొందరపడు చున్నవి.

సహ—నిశ్చయముగా వారికి మాకర్ధరాజ్య మిచ్చుతలంపేయున్న చో నీయనవసరమైనరాయబారము లేల? ఈకొఱగానివాక్యము లేల? ఎట్లయిన మాటలచేఁ గాలయాపనముసేయుటకు వారుతలంచుచున్నారు. మేము మాటలకు మోసపోవుకాలము దాటిపోయినది. ఇఁకమాశరపరికరమునకు సంపూర్తిగఁ బనికల్పింపవలయును సంగ్రామభూమినిఁ జొచ్చి కురుకుమారశతమును, మేముకట్టడగించి మారాజ్యము మేము గొనుట ధ్రువము.

సంజ (తనలో) తే. గీ. పట్టిమూర్ఖుండు కురుపతి । పాండవులకు
ధారుణిని సంగఁబోఁడు; వీ । రూరకొనరు
సంగరంబు భయంబుగా । జరిగితీరు
నుభయపక్షముల నాశ । మొదవు దాన

కానిమ్ము; ఇందుల కెవ్వరేమి చేయఁగలరు? (అందఱినిఁజూచి) పాండునందనులారా! మీ వాక్యములన్నియు వింటిని. మీరు చెప్పినవన్నియు ధృతరాష్ట్రునకెఱింగించెదను. ధర్మనందనా! ఇఁక నాకనుజ్ఞనిమ్ము. మాధవా పోయివచ్చెదను.

శ్రీకృ—మంచిది—

సంజ—(నిష్క్రమించును)

ధర్మ—కృష్ణా! మనకును వేళయైనది. (అందఱును నిష్క్రమింతురు)

రంగము:—[హస్తినాపురము:— కౌరవసభ:— ధృతరాష్ట్రుఁడు
భీష్ముఁడు—ద్రోణుఁడు—విదురుఁడు—దుర్యోధన
దుశ్శాసనకర్ణులు—అశ్వత్థామ]

ధృత—సంజయా! నీవెఱింగించిన పాండవుల వాక్యములన్నియు విన్నాఁడను. (ఇంచుక యూరకుండి) మనపక్షమున ననేక వీరులు చేరిరనియు, నిన్ని సైన్యములుండెననియు ధర్మనందనుఁ డెఱింగెనా? పాండవులెవ్వరి సహాయమును గొని మనపై కెత్తివచ్చెదరు?

సంజ—మహీవల్లభా! నీవడిగిన మాటకు నాకెంతయు నవ్వువచ్చుచున్నది. ధర్మనందనుఁ డెవ్వరి సహాయమున మనపై కెత్తివచ్చునని యడుగుచుంటివా? ఎంత వెఱ్ఱివాఁడవు. ధర్మదేవత పాండవులకుఁ దోడైయుండుననుమాట నీకు విదితమైయున్నది కదా. అది యట్లుంచుము.

సీ. బకహిడింబాసుర । ప్రాణాపహారియై,
భవ్యకీర్తినిఁ గొన్న । వాయుసుతుఁడు

ఖాండవంబునుగాల్చి కలికంతునోర్చిన,
శౌర్యనముద్రిండు సవ్యసాచి
శాత్రవోద్రేకంబు సమయించిఘనవిక్ర
మస్ఫూర్తిరాజిల్లు మాద్రిసుతులు
బాలుఁడయ్యునురణ కేళిలోరుదుగ్రని,
బలముమెచ్చనియాసు భద్రపట్టి
తే. గీ. విపులవిక్రమవంతుఁడు ద్రుపదసుతుఁడు
శౌర్యధనుఁడైన సాత్యకి సంగరప్ర
వీణులాద్రుపదవిరటో ర్వీరమణులు
చాలరా! యుద్ధముననిల్వ దృష్టతేంద్ర

వీరేగాక విరటునితమ్ములు, నాతనిపుత్రుఁడగును త్తరుఁడు కేకయపతులు జరాసంధసూనుఁడగు సహదేవుఁడు. నక్షీణబలపరాక్రమశాలురగు శిశుపాలతనయులు, యశఃభర్తయగు చేకితానుఁడు మొదలగు వారు పాండవులకు సహాయము సేయనరుదెంతురు. వీరందఱును నొక యెత్తు భీమసేన నందనుఁడగు ఘటోత్కచుఁడొక యెత్తు అతఁడు మాయాయుద్ధవిద్యావిశారదుఁడు. వీరందఱునట్లుండ,

మ. యదువంశంబునఁ బుట్టి శైశవమునం దానందమున్ దశోదదయుం జూచి వినోదలీలలను మోదంబుఁ గాఁ జేసి, దుర్మదకంసాదులఁ ద్రుంచి యాదవులన న్మానించు కృష్ణుండు సాఖ్యదశన్ గూర్చుచునుండు వారికెపుడున్ ద్రుష్టాపాలచూడామణీ ?

శ్రీకృష్ణునిసహాయము పాండురాజనందనులకుఁ బెట్టనికోట యే

ధృత—(తనలో) ఈసంజయుఁడు చెప్పినధికులందఱును ప్రబలులే. వీరందఱును నొకయెత్తు. భీముఁడొకయెత్తు. భీముని నామోచ్చారణ మాత్రమున నాకు రాత్రులయందు నిద్రరాదు. అతనింబోలు భుజబలశాలి మా కురుబలముల యందు లేడు. యుద

దండసన్నిభమగు తనగదాదండమును బూని, యాతఁడు కౌరవ సేనామధ్యమున భుజబలపరాక్రమమున విజృంభించి విహరింప కుండునా? సంగరంబున నాతనిని సురాసురులే గెల్చుట దుర్లభము.

సీ. నడురేయిగానలో నహిడింబుఁబరిమార్చి,
యన్నదమ్ములకును హర్ష మొసఁగె
బాహుబలప్రౌఢి బకదానవునిఁగూల్చి
యేకచక్రాపురి కిచ్చె ముదము
యతివపాంచాలికై యక్షులనోడించి
సౌగంధికముఁదెచ్చె శౌర్యమెసఁగ
ద్రుపదపుత్రినిఁగోరు దుర్మదాంధుఁడగుకీ
చకునిఁబంపించెనా జమునికడకు

తే. గీ. నట్టివాతాత్మజుఁదలంచి నంతమదిని
భయము వొడమి కనులుమూత బడవు రాత్రు
లందు నట్టిచో సమరంబు నందు నతని
నాకుమారులు గెల్తురా ప్రకటముగ.

ఎంతయోచించినను భీమశౌర్యజలధిని నీఁదుటకు నాపుత్రులకు శక్తి చాలదు. చిచ్చునకుగాడ్పు సహాయమగుకరణి నాతనికివివ్వచ్చుఁడు వచ్చును. అర్జునునకు సమానుఁడగు విలుకాఁడు త్రిజగములందు లేడు. అతనికి వాసుదేవుఁడు రక్షకుఁడై యున్నాఁడు పాశుపతగాండీవాస్త్రప్రయోగముల చేత గలుగు మహాగ్నిజ్వాలలు కురుసేననుదహింపక విడుచునా?

విదు—(ధృతరాష్ట్రునిఁ జూచి) ధృతరాష్ట్రమహీపాలా! సంజయునివలనఁ బాండవుల వాక్యములు వింటివికదా. ఇప్పుడైనను నీవు పాండవులకు రాజ్యభాగ్యమిచ్చువిషయమాలోచింపుము. ఇంతవ

ఐనను నీవు నీనందనులాచరించు దుష్కృత్యములకుఁ దలయూచుచుంటివి. ఇది నీకు ధర్మము కాదని నొక్కి వక్కాణించుచున్నాను. శకుని కర్ణదుశ్శాసనుల ప్రేరేపణంబున మంచిచెడ్డ లెఱుంగక దుర్యోధనుఁడు పాండవులతోఁ గయ్యము సేయఁ దలంచుచుండును. నీచిత్తము గూడ నీతిపథమున వర్తింపక యున్నది. ధర్మనందనుఁడు నియందున్న భక్తిచే శాంతము వహించియున్నాఁడు. భీమార్జునమత్తగజములుగూడ తమయగ్రజుని శాంతిశాసనమునఁ గట్టుబడియున్నవి.

చ. అనుజుఁడుచావఁగావగచి । యాతనిబిడ్డల సద్గుణాఢ్యులన్
బెనిచితివెంత యోర్పునను । బెంపుదలిర్పఁగ నెల్లవారలున్
వినుతియొనర్ప; నట్టియెడ । విజ్ఞులు దూషణ సేయఁగా భవ
త్తనయునిమాటలన్ విని, సు । ధర్మచరిత్రుల కెగ్గుసేయుదే.

పాండవులను గూర్చి జూదమునకుఁ బూర్వమే నీతో చెప్పియుంటిని. రోగికి పథ్యము రుచించదనునట్లు నాపలుకులు వీనులబెట్టవైతివి. గతించిన దానికిప్పుడు విచారించినను బ్రయోజనము లేదు. ఇప్పుడైనను పాండవుల కర్ధరాజ్యమిచ్చి యశమందుము. అట్లొనర్పవేని కులనాశనమగుట నిశ్చయము. నిరంతరము మీ శ్రేయము గోరుచుండు నేను నిష్కల్మషహృదయముతోఁ బలికిన పలుకులఁ బాటింపుము.

భీష్మ—(ధృతరాష్ట్రునిఁజూచి) ఆంబికేయా! విదురునిమాటలు సత్యము. దుర్యోధనుఁడు కార్యాకార్యము లెఱింగినవాఁడు కాక పోవుటచే నింతవఱకు వచ్చినది. పాండవులకర్ధరాజ్యమొసంగుట సర్వజనసమ్మతము. అది వంశాభివృద్ధికిఁ గారణము.

ద్రోణు—మహీపాలా! పాండవులు నీతనయుల కెప్పుడును నెగ్గు సేయఁ దలంపలేదు. అట్టిచో వారిని దూరస్థులఁ జేయ నీకు ధర్మము కాదు.

భీష్ము—ధృతరాష్ట్రా! తపము పెంపును, బలశౌర్యదర్పములును గలిగి లోకహితార్థమై చరించుచుండు నరనారాయణులుగా ధనంజయ కృష్ణులను భావింపుము. వారెప్పుడును సధర్మసంగరము కలిగిన చోట ధర్మపరులకు జయంబొనగూర్చుచుందురు. (దుర్యోధనునిఁజూచి) వన్నా! దుర్యోధనా! అర్జునుఁడు హిరణ్యపురమున నివాతకవచులవధించుట లోకవిదితమే కదా. దేవకీనందనుని బలపరాక్రమములు కంసనరకాసురాదిమహాదానవులవధచే బ్రసిద్ధములుగావే.

మ. హరిసాహాయ్యముగాంచి మోదమునను గ్రాజిఁ బ్రవేశించియ
య్యరులన్ దాఁకఁగనిల్చు పార్థునిసముద్యద్దర్పమే పార; నె
వ్వరు సాధింపఁగశక్తుకాదు, కిఁకనా వాక్యంబులాలించి, రా
జ్యరమన్ భాగమొసంగు పాండవులకున్ క్ష్మాపాలచూడామణీ

పాండవులను వధింతుననివి నిరంతరము పలుకుచుండు రాధేయుని పలుకులఁ బాటింపవలదు. ఈతనివలన నెట్టికార్యము జరగదు.

కర్ణు—(భీష్మునితో) గాంగేయా! వీవృవృద్ధుఁడవగుటచే విశేషముగ నెదిరించి మాటాడఁజాలను. అయినను, నేమనిపలికితివి? ఈకర్ణునివల నే కార్యమును జరుగదనియా! చేసిన, నీకర్ణుఁడే చేయువలయును. (దుర్యోధనునిఁజూచి) రారాజా! నన్నుఁగూర్చి యెవ్వరేమి చెప్పినను నీవు సందియమందవలదు.

మ. అలుకన్ మత్కరవాలమండితధను ర్జ్యాముక్తనారాచపం
క్తులచే సంగరమందుబంధుజనులా క్రోశింపఁగా పాండుపు
త్రుల దర్పంబును నార్చిపుచ్చికదు సంతోషంబునుం గూర్చి, యు
జ్జ్వలకీర్తిన్ విలసిల్లఁజేసెద నినున్ శౌర్యంబుదీపింపఁగన్.

భీష్ము—కర్ణా! ఎవ్వరైన విన్ననవ్వుదురని యైనదలంపక సిగ్గువిడిచి యిట్టిపలుకులేల పలికెదవు? ఇందునీబలపరాక్రమము తెలియగని

నారెవ్వరున్నారు. ఘోషయాత్రా సమయమునఁ గౌరవేంద్రు
గంధర్వునప్పగించిన పోటరివి కావా! ఈతఁడు గంధర్వునిచేఁ
బట్టువడినప్పుడు ధనంజయుఁడరుదెంచి విడిపించువఱకు మీకు
దిక్కు లేకపోయినది. ఈసంగతి నీవు మఱచిపోతివా? అనవస
రముగ లేనిపోనిప్రశంసకలిగించుకొని, యాత్మస్తవము జేసికొ
నుచుఁ బాండవుల దర్ప మార్చెదనని పలికినందువలనఁ బ్ర
యోజనమేమి యున్నది.

సీ. శౌర్యంబుజూడంగఁ జనుదెంచినట్టి, యా
హైమవతీమనో హారునికంటె
యమునానదీతీర మందపజయమును,
వడసినయంగార పర్ణుకంటె
ఘోషయాత్రకుఁబోవఁ గురుభూమివాధుని,
బట్టినగంధర్వ వరునికంటె
విబుధలోకమునెల్ల భీతినందించిన,
కాలకేయాదిరా క్షసులకంటె

తే. గీ. నీవుఘనుఁడవావిజయునిఁ గెలువ! నేల
పల్లదంబులు బల్కెదు భయము లేక
నిండుసభయందు నీరీతి నీదుబలము
దెలియఁజాలనివారెరి తెలుపుమిందు.

కర్ణ—నాయస్త్రసంధానచాతుర్యము నాబలపరాక్రమము వృద్ధుఁ
డవగునీకేమి తెలియును? (ధృతరాష్ట్రుఁ జూచి) దేవా! గురు
నియులుకచే నాకు బాణశక్తితగ్గియుండెనని జనులనుకొందురు
కాని యది యసత్యము. అమ్మహాత్ముని నారాధించి మఱల త
చ్ఛక్తిఁగాంచితి. అస్త్రశస్త్రములం దఖండసంపదఁబొందియు

న్నాను. నన్నుఁగూర్చి యెవ్వరును సందియమందనవసరము లేదు.

తే. గీ, ఎల్లిసమరంబునందున నెల్లవారు
గనఁగ సవ్యసాచినిఁదాకి కలితశౌర్య
విక్రమంబునఁబోరాడి వెలసిమీకు
మోదమునుగూర్చువాఁడను భూమిపాల.

భీష్మ— రాధేయా! ఆత్మస్తవమేల చేసికొందువు. నిన్నుఁ గాలుఁడే యాలీలఁ బ్రేలించుచున్నాఁడు. ఇంతమాత్రముచేత నీవు ఘనుఁడవని తలఁచెదమనుకొంటివా? సూతినందనా! పాండవులు నీచేఁ గూలెదరనుకొంటివా? దివిజనాయకుఁడిచ్చిన శక్తిచేఁ బాండవులు చత్తురని నీవు తలంచుచుంటివేమో! అట్టి యాశవిడువుము. శ్రీకృష్ణునిచేత నయ్యుదివ్యాయుధ్యాలగుచు. పాండవులు రణంబున బలపరాక్రమమున విజృంభించిరేని, కౌరవసేననెల్ల భస్మీపటలంబుగావింతురు. (ధృతరాష్ట్రునిఁజూచి) ఆంబికేయా! నీ పుత్రులు సకలమహీతలమునేలఁ గందుని సంతసించుచుండిరిగాని వారు చచ్చు సంగతిదెలియకయున్నారు. వీరుధనంజయునితోఁబెనఁగి ప్రాణములతో నుండఁగలరా? ఈకర్ణునకేమి! నోటికి వచ్చినట్లెల్ల పేలును. అర్జునుని నీతఁడు గెలుచునన్న మాట కల్ల. విరటునిగోబృందమును బట్టినప్పుడీతఁడెందుబోయి వాఁడు. (కర్ణునిఁజూచి) రాధేయా! కృష్ణుఁడు సారథియై భీమాదులు వెంటరాఁగ రథంబెక్కి గాండీవసహితుఁడై వచ్చువివ్వచ్చుని మార్కొనవశమా! నీవిట్టి పలుకులుపలికి సుయోధనుని బ్రోత్సాహపఱచుట చూడఁగా నాకెనిచావు నీకిష్టమైనట్లుతోచుచున్నది.

కర్ణ—(కోపముతో) పోనిమ్ము. గాంధేయుని చేత నే కార్యము నెఱవేర దనియే తలంపుము. ఇదిగో! రణంబున నీవు మడియువఱకును నే నస్త్రసన్యాసము గావించెదను (అస్త్రము విడుచును)

భీష్మ—(నవ్వుచు దుర్యోధనునిఁజూచి) కుమారా! దుర్యోధనా! కర్ణుండలిగి యస్త్రసన్యాసము చేసెనని నీవు భయమందఁబని లేదు. ఇటువంటి వాని హస్తమున నస్త్రమున్నను లేకపోయినను నొక్కటే.

ధృత—(తనలో) విదుర భీష్మద్రోణాదులకు యుద్ధమునం దిష్టము లేదు. (దుర్యోధనునిఁజూచి) వత్సా! దుర్యోధనా!

ఉ. నీవును బాండవేయులును నిర్మలచిత్తములన్ వహించి, భూ
మీవలయంబు నేలుచు, న మేయపరాక్రమవంతులై, నృపా
లావళిసంతసింపసుఖ మందుచునుండుటె శ్రేయమౌను, వ
త్సా! విని నాదుపల్కులను సంధియొనర్పుము యుద్ధమేటికిన్.

భీష్మద్రోణవిదురులుగూడ నిట్టిహితమునే బోధించుచున్నారు. భీమార్జునుల యప్రతిహతశౌర్యధైర్యపరాక్రమంబులఁగూర్చి భీష్మద్రోణుల కంటె నెఱింగినవారెవ్వరును లేరు. వీరు మనపక్షమున నుండుటం జేసి సేన మొగంబున నిలుతురు. పాండవులు గాంగేయునకు మనుమలగుటచేతను, ద్రోణాచార్యునకు శిష్యులగుటచేతను, మనయందెట్టి కృపయుండునో, వారికి నట్లేయుండును. మొదటినుండియు విదురుఁడు చెప్పినట్లే యగుచున్నది. కావున,

తే. గీ. పాండుసుతులునీకును బెర వారుకారు
కాన, మదిలోన నీవభి మానమూని
వారితోసంధిగావించి ప్రజలకెల్ల
ముదముఁజేకూర్పు మదియె న మ్ముదమునాకు.

ధర్మనందనుఁడు సార్థకనాముఁడు మనమెట్లు చెప్పిననట్లు నడచుకొనును. సంగరము కులక్షయమునకుఁ గారణము. భీష్మాదివృద్ధులు నిరంతరము నీక్షేమమును గోరివచించుచుందురు. వీరిమాటలు ద్రోసిపుచ్చవలదు.

దుర్యో—తండ్రీ! ఇంతవఱకు నడవులయందును, గొండలయందును, వసించి, యిప్పటికిఁ బురము జేరుకొన్న యీపాండురాజనందనులు భండనంబున మమ్ముఁ జెండఁగలరనుమాట కలలోనివార్త మనపక్షముననున్న వీరులు సామాన్యులని నీవు తలంచుచుంటివా?

చ. కలనమహోగ్రవృత్తిఘున ఖడ్గముగేలధరించి సంగర
స్థలమునిల్చెనేని మన తాతనుభీష్ముసిగెల్చువారలీ
యిలఁగలరే, యెఱుంగవె మహీశ్వర! యిమ్మహితాత్మువిక్రమం
బలఘుగుణిన్ జయింపఁడె సు పర్వులుసన్నుతిఁ జేసిమెచ్చఁగన్.

అయోనిజులగు ద్రోణకృపులు పరాక్రమమునవిజృంభించి రణముఖముననిల్చెనేని బురహరుఁడైన మాఱొడ్డనగలఁడా? పురహరసంభవుఁడగు నశ్వత్థామను నెవ్వరుజయింపఁగలరు? వీరందఱిని నట్లుండనిమ్ము నిరుపమభుజబలసంపన్నుఁడును, నిఖిలాస్త్రవిద్యాధురంధరుఁడును, నగురాధేయునినెదిరించువాఁడా పాండవపక్షమున నెవ్వఁడుండెనో వేయునుడచి చెప్పుము. బాహ్లీకసోమదత్తభూరిశ్రవశ్శల్యసైంధవాదివీరుల పరాక్రమాదిగుణము లెన్నఁదరమా! రణమున నాకు సహాయమొనరింపఁదలఁచి నిఖిలదేశాధీశులును నవసరమయ్యేనేని నాకై ప్రాణములనైనను నర్పింపసిద్ధముగానున్నారు. అట్టిచోఁ బాండవులకు మావంకఁదిరిగి చూచుటకైన శక్యముండునా? నివేమా భీమునిఁ బెద్దఁజేసి భయమందుచున్నావు.

తే. గీ వరగదాయుద్ధమునందున వాయుజాఁడు
నన్నునొందాకివజ్రిబా ణంబుచేతఁ

పర్వతంబులకలంబులై పగిదిఁగూలు
సందియంబేలనీకునో తాతలేంద్ర.

భీముఁడు కూలెనేని వారిపక్షమున రణమొనర్పఁగలిగినవీరుఁడెవ్వఁడు ? అర్జునుఁడుగలఁడనిపలుకుదువేని కర్ణునియొద్దనున్నశక్తిచేనాతఁడు తప్పకమడియును. ఇదియంతయునేల. సంగరమున మేము విజయమొందిరవుభవిం చినప్పుడు నీవే చూచి యానందింపఁగలవు.

ధృత—వత్సా! నామాటలు పెడచెవింబెట్టక యాలింపుము పాండవులతో వైరముడిగియుండుటే నాకుఁదోచినకార్యము. ధర్మనందనుఁడు శాంతసుధానిధి యగుటంజేసి మనముచేసినకార్యములు మనంబునఁదలంపక సంధికిచ్చగించును. నీవు రాజ్యమునందర్ధభాగము ధర్మనందనునకొసఁగి మనుట శ్రేయస్కరము. కర్ణుము నిన్ను బ్రోత్సాహపఱచుటయు, శకుని దుశ్శాసనులు, యుద్ధమే ఘనమైన కార్యమని చెప్పుటయు నీకుమిగుల నానందదాయకముగ నున్నది. రణాంగణమున నవార్యబలుఁడగు వాయునందనుఁడు గదాదండమున వైరిసేనను జావమోదునప్పుడైనను నాపచనంబులఁ దలంతువు. అర్జునుఁడగ్నిదేవునివలనఁ గార్ముకము వడసినాఁడు పాండవులను నిరంతరము ధర్మదేవతయు, వాయుదేవుఁడును, మహేంద్రుఁడును, నశ్వినులును, రక్షించుచుందురు. ఎన్నివిధములాలోచించిచూచినను సంధియేకర్తవ్యమని తోఁచుచున్నది.

దుర్యో—తండ్రీ! నీవేలపలుమారు లీ సంధివిషయమునుగూర్చి పలికెదవు? భీష్మద్రోణులు సంగరమునకిష్టపడరేని, రణమునకువచ్చువారితోడనే పాండవులను గూల్పఁజాలుదును. దుశ్శాసనకర్ణుల సహాయమునఁ బాండవక్రోధజ్వాలలఁద్రుటిలోనార్పెదను. అంతియేకాని సూదిమోపుటకుఁ జాలనిభూమినైన వారికొసఁగను

నాయుద్యమమున కీవు విచారింపఁబనిలేదు. నద్రిశిలఁ బేర్చివచ్చు కార్చిచ్చునైన నార్పఁగలను. ఝంఝూనిలంబు నిలుపనేర్తు. జలస్తంభనాది ఘనవిద్యల నెఱుంగుదు. రణమునం దనేక విధంబుల మెలంగఁగలను. నానావిధ మంత్రతంత్రంబులఁ దెలిసికొంటి. నేనలిగితినేని పాండవులను సురులైనను, రక్షింపఁజాలరు. ఆత్మస్తుతి పౌరుషము కాదను మాట నెఱింగియు, వారలకు నీవు భయమందితివి కాన బలుకుచుంటిని. ధృష్టద్యుమ్న సాత్యకీప్రముఖులును, మత్స్యపాంచాలాది దేశాధీశులును, నన్నుఁదాకి యస్మద్బాణాగ్నిజ్వాలలం దాహుతులయ్యెదరు. ఇది నిక్కంబని నమ్ముము. ఇంక నీవు మారుపలుకవలదు.

ధృత—(భీష్మునిఁ జూచి) మహాత్మా! గాంగేయా! మూఢుఁడగు దుర్యోధనుఁడు నా పలుకులాలింపక యున్నవాఁడు. నేనేమి సేయుదును

భీష్మ—విధికృతమును నెవ్వరు తప్పింపఁజాలరు. (ఇంచుక యూరకుండి) నేఁటికి సభఁ జాలింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





# పాండవోద్యోగము

## తృతీయాంకము.

(రంగము:—పాండవులు—ద్రౌపది —శ్రీకృష్ణుఁడు—ప్రవేశము.)

ధర్మ—(కృష్ణునిఁజూచి) కృష్ణా! యదుకులదీపా! నీకృపచే మేమెట్టియిడుమలు పొందకుండ శపథముననుసరించి వనవాసాజ్ఞాతముల దీర్చితిమి. విరటుఁడు మాయెడలఁ బ్రేమంబూని తనతనూజయగు నుత్తరను నభిమన్యునకొసంగి మాతో వియ్యమందుట యెంతయు శుభసూచకము. (ఇంచుకయూరకుండి) దేవా! నీవు మాయెడలఁ జేయవలసిన కార్యమొండుకలదు.

శ్రీకృ—

తే. గీ. సంశయము బొందగానేల స్వాంతమందు
నీతలంపేమొ తెలుపుమా నిక్కముగను
శిరమునందాల్చిచేయుదు శీఘ్రగతిని
పార్థివకిరీటదీపిత చరణకమల.

ధర్మ—

ఉ. ఆర్తులమైనమమ్ముఁ గృప నాదరణంబొనరింపఁగాజగ
త్కర్తవు నీవుగాకమఱి ధాత్రిని వేఱొకఁ డెవ్వఁడుండె, మా

యార్తిని బాపి సౌఖ్యముల ♦ నందఁగఁ జేయుచు రాజ్యమందునన్
వర్తిలఁ జేయుమయ్య యిఁకఁ ♦ బద్మదళేక్షణ! భక్తరక్షణా!

ధర్మపాశబద్ధులమై కౌరవులుగల్పించిన కడగండ్లనన్నిటిని నోర్చితిమి. అజ్ఞాతవాసానంతరమున మీయర్ధరాజ్యభాగము మీకొసంగెదమని కౌరవులు నుడివియుండిరి. మొన్న కౌరవుల పంపున నిచ్చోట కరుదెంచి న సంజయుని వాక్యములు నీవు వినియుంటివి కదా. మిత్రకార్యము నెఱవేర్చుటకుఁదగిన సమయమువచ్చినది. నీదయచే నవినీతుఁడగుదుర్యోధనునితోఁగలహము మానిసుఖించెదము. మేము నీకుఁబ్రద్యుమ్నాది కుమారవర్గముతోడివారము

శ్రీకృ—

ఉ. మీకునిరంతరంబుసుఖమే ♦ యొనఁ గూర్పఁదలంచుచుండగా
నీకిటులాడ నేమిటికి ♦ నీతల పెట్టివో చెప్పుమయ్యా, నే
జేకొని సేయువాఁడ నతి ♦ శీఘ్రగతిన్ భవదీయచిత్తమ
స్తోకముదంబునందఁబరి ♦ శుద్ధగుణాకరధర్మనందనా.

ధర్మ— కేశవా! మాయందట్టిప్రేమఁ బూనియున్నవాఁడవగుటచేతనే యీకార్యభారము నీపైఁబెట్టుచుంటిని. నీవుకరినగరంబునకరిగి, ధృతరాష్ట్రునితోడను, భీష్మాదులతోడను, దగినవిధమున సంభాషించి సంధిఘటిల్లునట్లు చేయవేడుచున్నాఁడ. మొన్న సంజయునితో నైదూళ్లిచ్చినఁ జాలుననివచించియుంటిని. ఇందులకెప్పుడునుదప్పను.

తే. గీ. కలుషమతియైనకురురాజు ♦ కరుణఁబూని
యింతమాత్రమయిననీయ ♦ నెంచకున్న
కూటికేకద యైదూళ్లు ♦ గోరియుంటి
వారు మేమును సౌఖ్యముల్ ♦ వడసి వెలఁగ.

అక్కటా! విరోధులయిన నేమి రాజ్యమునకై చంపనేల? మఱియొక మార్గముండదా! భాగ్యమునకై బంధువులను వధించి పిదప వచ్చు నిందాభరము భరింపఁజాల. కులనాశనమగుట నాయభిమతము కాదు. సమరమున జయాపజయములు దైవాధీనము. విజయలక్ష్మి మనలనే వరించు నని యెట్లు చెప్పఁగలము. కావున నావిన్నప మాలకించి సంధియొనఁ గూర్పుము.

(శ్రీకృ—) యుధిష్ఠిరా! నీయభిప్రాయము తెలిసినది. మొన్న సంజయుని సందేశము, నీప్రత్యుత్తరముగూడ వినియుంటిని. పాముచావకుండ బడితె విఱగకుండనున్న సంజయునిపలుకులు వింటివిక దా? నీచిత్తము ధర్మపథంబున నిలిచియున్నది. కౌరవులు వైరము విడుచునట్లు తోచదు. వారిపక్షమున భీష్మద్రోణులుండిరిక దాయని గర్వించుచుండిరి. అధర్మమునకు వారు భయమందరు. పితామహ కుంభసంభవ ప్రముఖాదులు చూచుచుండ నిండు సభయందు మీకెగ్గొనర్చిన యద్దురాత్ములిప్పటికినిఁ బశ్చాత్తాపముబొందరైరి. అట్టినీచులయెడల నెవ్వరాగ్రహమును బూనకయుందురు? నిజముగా నట్టి క్రూరమతులును, కల్మషచరిత్రులును, నగువారియందు, గరుణయు, బాంధవ్యమును, త్యజింపవలయును.

తే. గీ. మాయజూదంబునందు న మాయకుండ
వైననిన్ను గెలిచిదుష్ట దావనీశు
సుతఁబరీభవించిరదుశ్చ రితులయెడల
గరుణవహియింపఁగానేల క్ష్మాతలేంద్ర.

దురోదరానంతరమున సుయోధనాదులు మిమ్ముపలికినపలుకులను మఱచితిమా? రిపులనోర్చి ధాత్రినేలుట క్షత్రియధర్మమే. అయినను నీకోఁ

కద్దీర్ప నేనుహస్తినాపురమున కరిగి,హితులును, బంధువులును, నిఖిలసామంతరాజులును, వినుచుండ, ధృతరాష్ట్రునియెదుట నీధర్మసంధతయు సుగుణములును, మిగుల వర్ణించి, నాశక్తినంతయు వినియోగపఱచి సాధ్యమగు నంతవఱకు సంధిగావింపఁ బ్రయత్నించెదను. మదీయవచనముల సుయోధనుఁ డంగీకరించెనేని యది సర్వజనసమ్మతమై యొప్పు. లేదేని ప్రజలు వారినే నిందించెదరు. మనము సంధికిఁ బ్రయత్నించినవార మగుదుము. వారి బలాబలముల నరసి నీకు జయము కలుగు మార్గముగూడఁ జూచివచ్చెదను.

తే. గీ. మాయెడలఁబక్షపాతంబు మాని, యుభయ
పక్షములసేమమునరసి పరమకృపను
సంధియెటులేనియొనగూడు సరణిచూడు
మా! సభికులెల్లరువినంగ మాకశత్రు.

ధర్మవర్తనమూరయుము. ధృతరాష్ట్రుఁడుచెప్పుమాటలు దుర్యోధనుఁడు పెడచెవినిబెట్టెనేని, యంతమాత్రమున సంధి పొసఁగదనితలఁచి రయమున నేతేరక, యచ్చటివారెల్లవినుచుండ మానిష్కల్మషహృదయముల వెల్లడించి, పాండవులు ధర్మసంధులు; వారివలన దోషములేదనిజనులనుకొనునట్లు చేసిరమ్ము. వేయేల! నీకెట్లుతోఁచిన నట్లు చేయుము. అదియే మాకుఁబరమహితము. దామోదరా! నీవు వారినెఱుంగుదువు. ఎచ్చటనేరీతిభాషింపవలయునో యది యెఱుంగుదువు. నీకుఁ జెప్పుటకు నేనెంతవాఁడ.

శ్రీకృ—ధర్మసంభవా! సాధ్యమగునంతవఱకు సంధియగుమార్గమరసి వచ్చెదను. అయినను ప్రస్తుతము నాకగుచున్న శకునములను బట్టిచూడగా సమరమగుననియే నాకుఁ దోచుచున్నది. నీవు నిరుత్సాహివికాక సమస్తసేనలను సిద్ధపఱచి, మనపక్షమున నిలిచి పోరాడఁదలఁచివచ్చినవారిని, బ్రోత్సాహపఱచుచుండుము.

భీము — కృష్ణా! రణమునకు మేము వెనుదీయుదు మేమోయని యట్లు పలుకుచుంటివా యేమి? అట్లెన్నటికిని దలంపవలదు. కాని, కౌరవులతో యుద్ధముసేయవలయునను తలంపు మాకెవ్వరును లేదు. వారును మేమును గలసియుండుటయే మాతలంపు. సుయోధనుని మూలమున గులక్షయమగునని జనులాతనిని నిందించుచుండిరి కావున నెట్లయిన సంధియొనర్చి యాతని కా నిందబోగొట్టుము. మఱియొకమాట.

చ. కురుసభలోననాఁడునయ కోవిదులెల్లరుఁజూచుచుండ; యీ
పరమపతివ్రతన్ బరిభ వింపఁగ కోకలువిప్పినట్టిదు
శ్చరితులుకౌరవాధములు సంధికినొప్పరుగాని యీయుధి
ష్ఠిరువచనంబులన్ వినుచు సేయుముయత్నము దానికిన్ హరీ.

ద్రౌప — నాథా! మీరిట్టి కార్యమున కోడంబడుదురని నేను మున్నె యెఱింగియుంటిని. దుశ్శాసనుఁడు నాశిరోజములఁ బట్టుకొని నిండుసభలోనికీడ్చుకొని వచ్చుచుండఁ జూచి యూరకొనినప్పుడే మీపరాక్రమము వెల్లడియైనది.

భీము — ఏమీ! మేము పరాక్రమములేనివారమనియా! పలుకుచుంటివి.

మ. తరుణీయేలవచించెదీకరణిదో ర్దర్పంబునుంబూనిభీ
కరసంగ్రామతలంబునన్ రిపులపై కంజెండగాఁజాలు, దు
ర్భరశౌర్యంబుననొప్పుచుండియును, ధ ర్మజూపతిఁజూచి యీ
కురుసంతానముగూల్పనైతినిగదా కోపంబునీకేటికిన్.

ధర్మనందనుని శాంతస్వభావశృంఖలములందు మేముగట్టుబడియుంటిమను సంగతి నీవెఱుంగకయుంటివా? (శ్రీకృష్ణునిఁజూచి) కృష్ణా! భీష్మద్రోణకృపాదిమహావీరపరివేష్టితుఁడై నిండుపేరోలగంబుననుండు నాధృత

రాష్ట్రునకు నావచనములుగా నిట్లు చెప్పుము. అన్నదమ్ముల పుత్రులమగు మేము పోరాడుట మంచిది కాదు. సంధియెట్లయినఁ జేసి వంశమభివృద్ధిం బొందఁ జూడుము.

ద్రౌప—వస్త్రాపహరణసమయమునఁ జేసిన ప్రతిజ్ఞకు భంగమేకదా!

శ్రీకృ—బావా!

తే. గీ. రణమొనర్తు రుదుష్టకౌ । రవులతోడ
ననుచు వచియింపగా లేదె । యనిలపుత్ర
యిప్పుడీరితిఁ బలికెద । వేల, శౌర్య
మెందు దాచినాఁడవు భయం । బందియకట!

భీము—మాధవా! నేను రణమునకు భీతిల్లితినని తలంచితివా? చతుర్దశ భువనములొక్కపెట్టున నెత్తివచ్చినను భయమందువాఁడను గాను ఇదిగో చూడుము.

శా. ఉద్దండాహివిఖండనక్షతమహా । ద్యుద్ధప్రభావప్రభా
బద్ధాస్మద్భుజదండమండితగదా । పాతాహతిన్ వైరులన్
బ్రద్దల్ జేసెద భూతజాలము ముదిన్ । బాగంచుఁ గీర్తింపనా
గ్రద్దల్ మెక్కఁగ మాంసఖండచయముల్ । ఖండించి వైతున్ వడిన్.

ఇప్పుడే గదామాత్రసహాయుఁడనై కరినగరంబును బ్రవేశించెదగాక! (ఇంక నడచును) అరే! కురుకులపాంసనా! నీవు మాకుఁ బెట్టిన కడగండ్లకుఁ బ్రతిఫలము నేఁడనుభవించెదవుగాక!

మ. ధరణిం డాగిన నాకసంబుఁ జడిపి పా । తాళంబునం డాగినన్
శరధిం జొచ్చిన మేఘమండలమునన్ । ధైర్యంబుతో నుండినన్
వరశౌర్యంబును బేర్చి నీదయినద । ర్పం బెల్లఁ బోకార్చెదన్
గురుసత్రానము నీమృతింగనుము నా । క్రోశింపకు దుర్యోధనా.

(ముందునకుఁ బోవుచున్నాఁడు)

అర్జు—(భీముని వారించి) అన్నయ్యా! ఏల యీలీల మాటమాటకును నాగ్రహాయత్తచిత్తుఁడవగుచుందువు.

మ. పగరన్ జెండుట యన్న నీకది తృణప్రాయంబె యీపాంచాలికిన్
దగు కాలంబరుదెంచె నెందుకిటు క్రోధంబూనెదీవయ్యా, ధ
ర్మగరిష్ఠుండగు ధర్మసంభవుని హృద్రాజీవమున్ వాడఁజే
యఁగనూహింతువె శాంతమూనుమిఁక నో యన్నా మరున్నందనా.

భీము—శాంతమే యింత వఱకుఁ దెచ్చినది.

ధర్మ—(కృష్ణునిఁ జూచి) కృష్ణా!

తే. గీ. పగను డిగనాడి నామీఁది భక్తిచేత
సంకెలల యందుఁ జిక్కిన సామజంబు
పగిదియున్న వాయుసుతుని భావమునకు
నాగ్రహ మొదవఁ జేయఁగ న్యాయమగునె

శ్రీకృ—(భీమునిఁ జూచి) బావా! వాయునందనా! పరిహాసమునకాడిన వాక్యముల కింత యాగ్రహమూనెద వేఁ ? శాంతింపుము. కురుకుమార ఘోరగహనము దహించుటకు నీవుగాక మఱెవ్వరు శక్తులగుదురు ?

అర్జు—మాధవా! హాస్తినాపురమునకరుఁగఁ దలంచిన నేను నీతోఁ గొన్ని విషయములు చెప్పఁ దలంచితిని.

మ. ధృతరాష్ట్రుండతికష్టమానసుఁడు ధాత్రీభాగమీయంగఁ దా
మతిలో నెంచునె వానిపుత్త్రుఁడును దుర్మార్గుండు సంధించునే
కుతుకంబూనితివీవు సంధికొఱకై గోవింద మాయాస్త్రసం
తతి స్వస్థానమునందునుండునటులన్ గావింపు మావేడెదన్.

నీవు చేయఁబోవు కార్యమునకు భంగము కలుగదు. మమ్మనేకవిధములఁ బరాభవించిన ధార్తరాష్ట్రులు వధ్యులనుటకు సందియము లేదు. అయి

నను మాయగ్రజుఁడు చెప్పినచొప్పున సంధిగావింపయత్నింపుము. వారందులకు సమ్మతింపరేని నావచనములుగా నిట్లుపలుకుము "ఆశ్రిత బంధుమిత్రజనములను సత్కరింపుఁడు. వెనుకటికంటె నెక్కుడుభోగముల ననుభవింపుఁడు. పిదప బ్రాణములరచేతనుంచుకొని సమరమున కరుదెండు."

నకు——వాసుదేవా! మాచిత్తములు వనవాసముననున్న భంగినింగాక మిగులతీవ్రతపించియున్నవి. సంధిఁజేసికొనుతలంపే వారికున్నచో గోగ్రహణానంతరమున జేసికొనియేయుందురు.

సహ——కృష్ణా! సంధికై నీవరుగుచుంటివిగాని, ధార్తరాష్ట్రులందుల కొడంబడరు. మాచే సుయోధనుఁడు నిహతుఁడు కావలెనను కోరిక మాహృదయములందుసంపూర్తిగనాటియున్నది. అర్ధరాజ్యభాగ మొసఁగనిచో కురుకుమారులు సైన్యసమేతముగా మాకోపాగ్నిజ్వాలలకాహుతియగుదురనిరూఢిగా దెలుపుము.

ద్రౌప——ముకుందా! నావిన్నపముగూడ నొక్కింతవినుము. నన్నుఁగూడ కృపజూడుము. ఈధర్మనందనుఁడు కౌరవులర్ధరాజ్య మొసఁగకపోయినను నైదూళ్లయినఁజాలునని పలుకుచున్నాఁడు. సుయోధనుఁడందులకుఁగూడ సమ్మతింపఁడు. వీరు వారిని నొంచలేరు. వీరిసంధివాక్యములు వినెనేని సుయోధనుఁడు మఱింత దురభిమానియగును. అచ్చటివారు సమరముగాంక్షించియున్నను, వీరరణ్యములకేగుదురుగాని యుద్ధమునకుఁబ్రయత్నింపరు. ఎట్లయినను వీరిసుజనత్వము చెడకుండ సంధిగావింపఁబ్రయత్నింపుము. వరమున ద్రుపదభూవరునకు హోమవేదియందు జన్మించి, పాండవులకు భార్యనై బలపరాక్రమవంతులగునేవురపుత్రులఁబడసి సహజన్ములప్రాపుగాంచియుండియు, నాకీదుఃఖములు దప్పినవికావు. రాజసూయమహాధ్వరమున భావ

సంబైనమదీయవేణి నొక దుర్మార్గుఁడు నిండుసభలోఁ బట్టియీ
డ్చుచుండ వీరుచిత్రప్రతిమలవలెఁ జూచుచుండిరి. గోవిందా! పా
పాత్ములను దండించుట పాపమనితలంతువా? వారియెడల
మనముగృప వహించుటకు బ్రాహ్మణులా! పాపాత్ముఁడగు
దుర్యోధనుఁడు సజీవుఁడై యుండవలసిన దనియేనాసీకోరిక?
దుష్టులగు కౌరవులయెడల దయఁ జూనవలదని నాప్రార్థన. ఒ
కవేళ నాపతులూరకున్న నాపుత్రులును నాసోదరులును నా
పరాభవాగ్నిఁ జల్లార్చి తీరెదరు.

శ్రీకృ—సోదరీ! నేనుండఁగా నీవీరీతినిఁ జింతింప నేల? సంధికిఁ గౌర
వు లంగీకరింతురనుట కలలోనివార్త.

మ. గరితా! యేలవిచారమందెదవులోకైకస్తుత్యుఁడౌ యీయుధి
ష్ఠిరభూపాలుఁడు పంప, భీముఁడుగదున్ కేలదోడుగావింప, భా
స్వరగాండీవముదాల్చి రౌద్రమున భీకైభత్సుండు నేతేరగాఁ
గురుసంతానముగూల్చి నీకుముదముఁ గూర్తుఁ దనర్ప నమ్ముమా

(పాండవులను జూచి) బావలారా! ఇంక నేనరిగి ప్రయాణసన్నాహము
చేసికొనవలయును గదా!

ధర్మ—జగద్బాంధవా! ముందువెనుకలారయక నిన్నుఁ గౌరవుల కడ
కేగుమని పలికితిని. ఇప్పుడందులకు మరల నాచిత్తము సమ్మ
తింపకయున్నది. సుయోధనుఁడు కడుఁగుటిల వర్తనుఁడు. అతని
యనుచరు లంతకంటె నెక్కువవారు. వారు నీమాటలు విన
కుండుటయేగాక నీయెడల నేమి కీడుగావింపఁదలంతురోయని
సందియముగూడఁగలుగుచున్నది.

శ్రీకృ—బావా! నన్ను గుఱించి నీవుభయమందఁబని లేదు. నీవువచించి
నట్లుదుర్యోధనుఁడును, నతని యాప్తులును నట్టివారే. కాని

వారివలన నాకేహానియు సంభవింపదు. ఒకవేళ పట్టి దేదయిన వారు దలంచిరేని, నేనలిగిన నక్కడ నన్ను మార్కొనువారెవ్వరు? నేను సాత్యకినిగూడ వెంటఁబెట్టుకొని పోయెద. మీరు శంకింపవలదు. రండు.

(అందఱునిష్క్రమింతురు)

ఇదితృతీయాంకము:





# పాండవోద్యోగము.

## చతుర్థాంకము.

రంగము:—[కౌరవసభ-ధృతరాష్ట్రుఁడు-భీష్మద్రోణులు-దుర్యోధన దుశ్శాసనకర్ణులు సంజయుఁడు, ఆసీనులైయుందురు.

ధృత—(సంజయునిఁజూచి) సంజయా! మఱచిపోయితిని. మొన్న నీవు పాండవుల కడకరిగినప్పుఁడర్జునుడేమని పలికెను?

సంజ—మాయర్థరాజ్యము నొసంగుమని యడుగ వారీయరేని, యింత కుమున్ను వారొనర్చిన దుష్కార్యములకు మఱింత మెఱుగు పెట్టినయట్లగును. సమరమునందు సుయోధనుఁడు గూలిన ప్పుడుగాని ధర్మజునకు వనవాసము నందుబడినయాయాసము తీరదు. కురంగపంక్తిపై బడినసింగములరీతి మేముకురుసేనపైఁబ డినప్పుడు గాని కౌరవులుఁమమ్ము సఱకుగొనరు. రణవిద్యాపా రగుఁడగుధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిడాయు నప్పుడుగాని, మమ్ము లక్ష్యపెట్టరు. శ్వేతవాహనుఁడనై, భగవంతుఁడగువాసుదేవుడు సారథియై. నేనురథికుఁనై సమరభూమిఁబ్రవేశించి, రిపు మండలిమధ్యమున విహరించు నప్పుడు మాసత్యము వా టింతురు.

ధృత—సంజయా! పాండవులపక్షమున నున్న యోధులందఱును
నొకయెత్తు మారుతసూతి యొకయెత్తు ఆభీమునిఁ దలంచినచో
నాకు రాత్రులయందు నిద్రరాదు. కాలదండ సన్నిభమగు
గదాదండమును బూని రణంబునఁ బ్రవేశించెనేని యాతనిని
మార్కొనఁ జాలువీరుఁడెవ్వఁడు? చిచ్చునకు గాడ్పుతోడైవ
చ్చునట్లాతనికిగాండీవిసహాయమాచరించును. ఇదియుంగాక వారి
కి శ్రీకృష్ణునిప్రాపున్నది. ఈభీష్మద్రోణులు మనపక్షమున
నుండిరి గాక వారీ గాంగేయునకు గుటచే తను
ద్రోణాచార్యునకు శిష్యులగుటచేతనుమనయిం ఁట్టికృపయుండు
నో వారియందును నట్లేయుండును-పాండవులతో యుద్ధము
కులక్షయమునకుఁ గారణమని తోఁచుచు:

భీష్మ—ఆంబికేయా! ఈవిషయనిర్ధారణమునకు... సమయము వ
చ్చినదికదా! ఇందుకేగదా భగవంతుఁడగు వాసుదేవుఁడయ్యో
డకరుదెంచినాఁడు. అమ్మహానుభావుఁడరుదెంచిన కార్యమును
దీర్చి వంశముద్ధరింపుము.

ధృత—కుమారా! దుర్యోధనా! భీష్మద్రోణవిదురాదివృద్ధులందఱును
చెప్పుచున్న వాక్యములాలించియశమంపుము

దుర్యో—తండ్రీ! పాండవులకు నేనావంతయు భయపడను. నల్దిశలు
జేర్చివచ్చెడు కార్చిచ్చునార్పఁగలను. జలస్తంభనాదివిద్యల
నెఱుంగుదు. నానావిధమంత్రతంత్రములఁదెలిసికొంటిని. ఆత్మస్తు
తి పౌరుషము కాదని యెఱింగియుండియు వారలకు నీవుభయ
మందితివి గావునఁ బలికితిని.

(శ్రీకృష్ణుఁడు—విదురునితోఁ బ్రవేశించును)

విదు—(కృష్ణునిఁజూచి) దేవా! నిన్నదుర్యోధనుఁడు నిన్ను దనగృహాం

బున విందారగింపరమ్మనివలికెనుకదా! నీవేల సమ్మతింపలేదు. అందులకేమనిప్రత్యుత్తరమిచ్చితివి.

శ్రీకృ—అతఁడుపిలువ నేనుసమ్మతింపనైతిని. అందులకుఁగారణంబడు గనిట్లు చెప్పితిని. "దుర్యోధనా! పగవారియింట నన్న మమృతమే యైనను విషంబని యనుమానముపొడముచుండును. నేనుశత్రు వుఁడనాయని యడిగెదవేమో? వినుము. పాండవులు నాకుఁ బ్రాణసమానులు. వారికిని మీకును వైరముకలదు. అదియుం గాక నేనిప్పుడు వారిదూతనై యరుదెంచితిని. వచ్చిన కార్యము సంసిద్ధిమైనపిదపనిట్టి మర్యాదనీవుచేయుటయు, నేనుబొందుట యు సంతోషకరంగ నుండునుప్రస్తుతమువిదురునియన్నముభోక్త వ్యమని తలంచినాఁడ.

విదు—మహానుభావా! దాసుఁడనగునాయందు నీకట్టికరుణయున్నది.

మ. సరసీజోద్భవవాసవాదిసురులు శ్రాంతంబు సేవింపఁబె
ల్లిరవైయుండుమహానుభావుఁడవునీ వీరీతిఁజిత్తంబునన్
గరుణంబూనిమదీయగేహమునకుం రాఁగాంచినానయ్యయ
ద్దిర భాగీరథి చొటినేలపయి న ర్థింబారినట్లోహరీ.

(ఇంచుకయూరకుండి) మాధవా! సుర్యోధనుఁడు సంధికొడఁబడునని యే తలఁచుచుంటివా? కౌరవపక్షపాతులై సమరమునకు సంసిద్ధులై వచ్చినవారినిఁజూచి మిటిీయుచున్నాఁడు. మహనీయగుణాకరుఁడవై నీవీ నీచులకడకు సంధికార్యమునకై వచ్చుట మిగులవింతగనున్నది. వీరు నీకేమియెగ్గుదలంతురోయనుభయము గూడ నాకుఁగలుగుచున్నది.

శ్రీకృ—విదురా! సుయోధనుఁడు సంధికొడంబడఁడని యెఱుంగుదును. ఇప్పుడీకార్యభారము నేనువహింపకుండునేని, కౌరవపాండవు లు కయ్యముసేయుటకుదిగుచుండగాఁ గృష్ణుఁడూరకుండెనని జ నులు నన్నునిందింతురు. అందులకై యిట్లువచ్చితిని. నాశక్తినం

తరయుధారవోసి సంధికై ప్రయత్నించెదను. కౌరవులొడంబడరేని తత్ఫలము వారనుభవింపఁగలరు. (ఎదుటఁజూచి) అదిగో! ధృతరాష్ట్రుఁడు భీష్మాదులతో సభదీర్చియున్నాఁడు.

భీష్మ— (ధృతరాష్ట్రునితో) మహాత్ముఁడగు వాసుదేవుఁడు వచ్చుచున్నాఁడు.

(భీష్మాదులెదురేగి శ్రీకృష్ణునిఁదోడ్కొనివత్తురు)

ధృత—(కృష్ణునిఁజూచి) ముకుందా! ఆమణిపీఠముననాసీనుఁడవుగమ్ము.

శ్రీకృ—(ఆసీనుఁడై అందఱినిఁజూచి) మీరును మీపీఠములనాసీనులుగండు.

(అందఱును కూర్చుందురు)

శ్రీకృ—ధృతరాష్ట్రమహీపాలా! నిన్నటిదినమంతయు శిష్టగోష్ఠితో జరిగినది. ఇఁకనేనువచ్చిన కార్యమునీకుఁదెలుపవలయునుకదా? పాండవులపంపున నేనుమీకడకుదూతనై వచ్చితిని. నీకుసమస్త విషయములు తెలిసియేయున్నవి. అయినను చెప్పుచుంటిని. నీ కొడుకులవలన ధర్మసాధులగు పాండురాజనందనులు పడరానికష్టములన్నియు నెఱిఁగియేయుంటివి ప్రతిజ్ఞాబద్ధులైవారు వనవాసాజ్ఞాతములుదీర్చివచ్చిరి. భరతవంశము ధర్మసాధతకుఁబట్టుకొమ్మయని లోకులాడుకొనుమాటకు భంగమురానీయకుము. నీకుమారులును, పాండురాజకుమారులును క్షీరనీరములచందమునఁగలసిమెలసి సుఖించుతెరువు నూహింపుము. ఇది యన్వయాభివృద్ధిమార్గము. నీవుతలంచినచో నెట్టికార్యమునైనను చేయఁగలవు. ఇప్పుడు నీవుపేక్షవహించితివేని, పాపమొదవును. ఇరుతెగలలో నెవ్వరికిఁగీడుసంభవించినను నీకువిచారముకలుగకమానదు. ఉభయుల సౌఖ్యము గోరినవాఁడనగుటచే నేనువచ్చి యిట్లు చెప్పుచుంటిని.

భీష్మ—మాధవా! మాకురువంశజులసేమము నిరంతరముగోరుచుండు నీవువచ్చుటంజేసి, కార్యము సానుకూలముగాక యుండునా?

ధృత—(దుర్యోధనునిఁజూచి) కుమారా! సుయోధనా!

తే. గీ. మనకడకు నెన్నఁడును రాని । మాధవుండు
వచ్చియుండెను నేఁడిట్లు । పరమకృపను
యీమహాత్ముఁడు చెప్పిన । ట్లీవుచేసి
జనులుమెచ్చఁగఁబడయుమా । సద్యశంబు.

దుశ్శా— (దుర్యోధనునితో రహస్యముగా) అన్నయ్యా! జాగ్రత్త సుమా!

కర్ణ—రారాజా! గోపాలునిమాయలోఁబడెదవేమో!

శ్రీకృ—(ధృతరాష్ట్రునిఁజూచి) అంబికేయా! పాండురాజనందనులు నీకన్యులుగారు. పాండురాజు నీయందెట్టిభక్తినిఁబూనిచరించెనో నీకుఁదెలియకున్నదా? అది మఱచియుండనని తలంచెదను.

తే. గీ. భవ్యగుణమూర్తియైనయా । పాండునృపతి
బాహుబలవిక్రమంబునఁ । బగఱఁగెల్చి
ధనముదెచ్చినీకర్పించి । ఘనసుఖములఁ
బెక్కునీచేతఁ జేయించి । వెలయు లేదె.

అట్టిచోఁబాండునందనుల యందు నీవుభేదబుద్ధి వాటించుట ధర్మముకాదు. వారు నీపదములకు నమస్కరించి యిట్లు వక్కాణించిరి. జనకా! బాల్యమునందే మాతండ్రి గతింప మమ్ముగారాబమునఁ బెంచి పెద్దవారిగఁజేసి విద్యాబుద్ధులఁ గఱపించితివి. నీకుమారుఁడగుదుర్యోధనుఁడు మామొదల నసూయఁబూని మాయద్యూతమున మమ్మోడించినను, ధర్మపాశబద్ధులమగుటచే వనవాసాజ్ఞాతములుసలిపివచ్చితిమి. ఇఁకమాయందు గరుణ వహించి, యర్ధరాజ్యభాగము నొసంగిరక్షింపుము.

భీష్మ—వత్సా! దుర్యోధనా! పాండవుల సందేశము వింటివికదా!

శ్రీకృ—ధృతరాష్ట్రభూపతీ! పాండవులప్రార్థన విని వారికి నర్థరాజ్యభాగము నొసంగి యుభయకులముల నుద్ధరింపుము. వీరెన్నియిడుమలనందఁజేసినను, ధర్మసంభవుని సత్ప్రవర్తననైనవిచారింపుము. నిండు సభయందు పాంచాలరాజపుత్రికకొనర్చిన పరాభవము మఱువఁదగునదా? అట్టి సమయమున నీకొడుకులను వారింపవైతివి. పరాక్రమము కలిగిన వారయినను, భీమార్జునులుధర్మజునిశాంతవాక్యపాశములబద్ధులై యుండిరి

ఉ. వారుమహానుభావులు భవచ్చరణద్వయ సేవసేయుచు
న్నారలు దీనికీవును మనంబున సమ్మతినందకున్నచో
ఘోరరణంబునన్ రిపులఁ గూల్చఁగడంగెదరయ్య,యిందు నీ
కారయనిష్టమేదొయది యాత్మనెఱంగివచింపుభూపతీ?

భీష్మ—ఆంబికేయా! బలదేవకృష్ణ సాత్యకులు బంధువులుగను హితులుగను నొప్పుచున్న పాండవేయులను రక్షింపుము. వారు నీసుతులకంటె నీకుఁ బరమభక్తులు.

ద్రోణు—కురుభూపతీ! కౌరవులును పాండవులును నీకు సమానులే. కావున బాండవులను దూరస్థులుగాఁ జేసినచో దురితము సంభవించును.

ధృత—కుమారా! దుర్యోధనా! పుండరీకాక్షుడుఁ పాండవదూతయై వచ్చుటంజేసి మనము.ధన్యులమైతిమి. వృద్ధులును ధర్మతత్పరులునగు నిద్రోణగాంగేయులు నీసౌఖ్యమును గోరివచించుమాటల వినుము. దుశ్శాసనశకునికర్ణులు యుక్తాయుక్తపరిజ్ఞానహీనులు. నావాక్యము లాలించి పాండవుల కర్థరాజ్యము నొసంగి శ్రేయముఁలందుము.

విదు—దుర్యోధనా! మీసేమమున భిలషించి వచ్చిన దామోదరుని వాక్యములాలింపుము.

దుర్యో—కృష్ణా! యదువంశతిలకా! సంధికార్యభారము వహించి వచ్చినందులకు సంతసించితిని. కాని, నిన్ను మనోరథసిద్ధునిగాఁ జేయఁజాలనందుల కెంతయుఁ జింతించుచుంటిని. వారియెడల నేను జేసిన దుష్కృత్యమెద్దియు లేదు. జూదమున వారోడిపోవుటం జేసి ప్రతిజ్ఞననుసరించి యరణ్యముల కరిగిరి.

తే. గీ. వినుము మధుసూదనా నేను ♦ భీతిఁబొంది
పాండునందనులకు రాజ్య ♦ భాగ మొసఁగఁ
జాల! పలుమాట లేటికి ♦ సమరమందు
గలితజయలక్ష్మిఁ గాంచినఁ ♦ గాంచనిమ్ము

శ్రీకృ—(ధృతరాష్ట్రుని జూచి) భూపాలా! వింటివి గదా? నీకుమారుని పలుకులు! నీవు విని యూరకుండు వేల? ఈతని గర్వమునకు నే నేమనువాఁడ! ఈతఁడొసఁగకపోయినను బాండవులెట్లయినవారి యర్థరాజ్యభాగము వారు గాంచెదరు. కానిమ్ము! ఇందుల కెవ్వరేమి సేయుదురు. ప్రళయకాలకాలునిలీల; మారుతసూతి భండనమున బ్రవేశించి గదాదండముచే వైరివీరశిరంబులను పిప్పియొనర్చునపుడైన సుయోధనుఁడు వారికర్థరాజ్యము నొసఁగకయుండునా? ఆకొన్న సింగములు హరిణములపైఁబడుచందమున మాద్రేయులు రిపుసైన్యముల వేటాడునప్పుడైన నీతఁడు వారి సఖ్యమును బాటింపక యుండునా? మహేంద్రనందనుఁడు గాండీవధారియై శత్రుసేనామధ్యమున విహరించునపుడైన నీతనిచిత్తము తిరుగక యుండునా? (ఇంచుకయూరకుండి రాజేంద్రా)! నీకుమారుని చిత్తము సమరముమీఁద నేయున్నది. పాండవులు రణమునకు భీతిల్లుదురనితలంచెను కాఁబోలు

ఉ. వారలశౌర్యసంపదలు । వారలధర్మపథాను వర్తనల్
వారల సద్గుణోన్నతులు । వాక్పతికైననుతింపశక్యమే
భారతవంశచంద్రములయి । భాసిలుచుండినవారితోడనా
హా! రణమందు నిల్వగను । నాత్మదలంతురె యెట్టివారలున్

పాండునందన దుర్వారకోర్ధాగ్నిఁబడి శలభసుగుట కేయీతనికిట్టిబుద్ధి పుట్టినది.

దుర్యో—కృష్ణా! ఏదోషము నెఱుంగని నన్ను కారణముగ దూషింప దొరకొనకుము.

శ్రీకృ—ఏమీ! నీవలన దోషములేదని పలుకు చుంటివా? బాల్యమాదిగ నీవుపాండవులకు సంకటములనే గూర్చుచుంటివి. వాయునందనుని సర్పములచేఁ గఱపించితివి విషభోజనము బెట్టించితివిలక్కయిల్లు గాల్పించితివి. నీవెంత చేసినను ధర్మసంధుల గుటచే వారేహానియుఁ బొందక యుండిరి. ఇంతయేల నిండుసభయందు పాంచాలి వస్త్రములొలిపించుట దురాగతమంటువా! కాదా? అయినను గతించినదానినిదలఁపనేల? ఇప్పుడైనను సంధిసమ్మతింపుమని పలుకుచుండ సమ్మతింపకయుంటివి.

దుశ్శా—(దుర్యోధనునితో నేదియో రహస్యము చెప్పగా దుర్యోధన దుశ్శాసనకర్ణులు సభవిడిచి పోవుదురు.)

భీష్మ—పాండవకార్యార్థియై కేశవుడరుదెంచి సభయందుండగాసు యోధనుఁడాతనిమాట వినకుండుటయేగాక సభనుగూడ విడచి పోయినాఁడు.

శ్రీకృ—అంబికేయా! దుర్యోధనుఁడు మిగుల గర్వించి యున్నాఁడు. ఈతఁడు వంశనాశనము చేయుటకే పుట్టినాఁడు,
ఇతని వానిని చంపినను పాపముగలుగదు సర్వశాస్త్రముల

యందుఁ జెప్పఁబడియున్నది. మున్ను నాకు మేనమామ యని తలపకుండ కంసుని వధించి వంశముద్ధరించితిని.

ధృత—హరిహరీ!

(తెరలో)

హేలీలామానుషవిగ్రహా! కృష్ణా! దుర్మతులగు సుయోధనాదులు నిన్ను బంధింపఁ జూచుచున్నారు. జాగరూకుఁడవై యుండుము.

శ్రీకృ—(తనలో) ఇవి సాత్యకి పలుకులు. కానిమ్ము; దుర్యోధనునకుఁ దగినపరాభవము చేసెదఁగాక!

భీష్మ } ఎంతదురాగతమెంత దురాగతము.
ద్రోణు }

ధృత—విదురా! సత్వరముగ దుర్యోధనాదుల నిటకుఁ దోడ్కొని రమ్ము.

విదు—(నిష్క్రమించి వెంటనే దుర్యోధనాదులతోఁ బ్రవేశించును)

ధృత—(దుర్యోధనునితో) కుమారా! దనుజారిం బట్ట తలంచుచుంటివా!

శ్రీకృ—దుర్యోధనా! ఎంత కార్యము చేయఁదలఁచితివి. నన్ను బట్టుటకు నీకు సామర్థ్యమున్నదా!

మ. నను నీ వ్వానిగాఁగ నెంచితివొ నా ♦ నాదుష్టవంశాటవీ
ఘనదావానలమూర్తినంచరయుమీ ♦ కష్టాత్మ నీయట్టిదు
ర్జనులన్ జంపి ముదంబునన్ ధరణి భా ♦ రంబంతయుందీర్పగా
జననంబందితినిట్టిరూపున; వెసన్ ♦ శౌర్యంబు జూపింపుమీ.

నీవంటివారు పదివేలమందియైనను నన్ను బంధింపఁజాలరు. అయినను శక్తివినియోగపఱచి కోరికఁదీర్చుకొనుము.

(విశ్వరూపముధరించును,—దుర్యోధనాదులుమూర్ఛిల్లుదురు.)

భీష్మ—ఆహా! నే నెంతయు బుణ్యముజేసికొని యుంటిని.

(చేతులుజోడించుకొని శ్రీకృష్ణునిఁజూచి)

మ. కలనైనన్ సులభంబుగాదు భవదాకారంబుజూడంగ, యా
నలినప్రోద్భవముఖ్యదేవతలకైనంగాని, మల్లోచనో
త్పలముల్ ధన్యత గాంచగల్గెభవదాత్తంబుతాస్యంపుమండలి
దర్శించితి నెంతపుణ్యమొ రమానారీమనోవల్లభా.

విదు—దేవా? పరమనిష్ఠాగరిష్ఠులై యరణ్యములయందు ఘోరతప మొనర్చు మహానుభావులకు నైనను దుర్లభమైన నీదివ్యమంగళ విగ్రహసందర్శనము జేసికొని కృతార్థుఁడనైతిని. తండ్రీ! భక్తుల మగుమాకు నీదివ్యరూపము జూపుటకే కాఁబోలు, పాండవదూతవై యిచ్చోటకరుదెంచితివి.

ధృత—(విదురునితో) విదురా! ఈజగత్ప్రళయ సంక్షోభ మేమి?

విదు—భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు విశ్వరూపము ధరించినాఁడు.

ధృత—ఆదేవదేవునిసన్నిధికి నన్నుఁగూడఁదోడ్కొని పొమ్ము.

విదు—(అట్లుచేయును.)

ధృత—(కరములుమోడ్చి) హే! జనార్దనా! దీనతాత్రణపరాయణా! నీదివ్యరూపము జూచుటకు, నంధుఁడ నగుటచే నశక్తుఁడనై యుంటిని.

శ్రీకృ—ఇదిగో! దృష్టిఁబ్రసాదించితిని.

ధృత—(కన్నులు తెఱచిచూచి) మహాత్మా! నిన్నుదర్శించి కృతార్థుఁడ నైతిని. నిన్నుఁజూచినయీకన్నులతో నితరమొంకుచూడనొల్ల ను. నాదృష్టినడపి, భయముగొలుపుచున్న నీతేజము నుపసం హరింపుము.

శ్రీకృ—(అట్లు సేయును)

(దుర్యోధనాదులు మూర్ఛనుండి లేచుచున్నారు)

శ్రీకృ—(ధృతరాష్ట్రునిఁ జూచి) మహీపాలా! నేను వచ్చిన కార్యము తుదకీరీతిగఁ బరిణమించినది. కానిమ్ము; ఏదియెట్లు జరుగవలయునో యట్లు జరుగును. ఎవ్వరేమి సేయఁగలరు? ఇకఁ నాకరుగుట కాజ్ఞనిమ్ము.

ధృత—మాధవా! అరిగెదవా? సంధియగునేమోయని తలఁచితిని. నా ప్రారబ్ధమిట్లున్నది. దయయుంచుము.

శ్రీకృ—నేను దయయుంచి చేయఁగలిగిన దేమున్నది. అస్త్రవిద్యాధురంధరులగు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణులుండిరికదా.

ధృత—కృష్ణా! పేరునకు మాత్రము సంగరముఖమున శరంబులఁబూని నిలువఁగలరుగాని, నీవు రథంబున నుండ పార్థుఁడు గాండీవధారియై విక్రమవిహారము చేయఁ గడంగినప్పు డెవ్వరు యెదిరించి నిలువఁగలరు?

శ్రీకృ—ఇఁక నేను పోయివచ్చెద.

ధృత—విదురా! నీవును భీష్మాదులును గలిసి వాసుదేవుని గొంతదూరము వఱకు బంపిరండు.

(తెర వాలును.)

(భీష్మాదులును శ్రీకృష్ణుఁడును నడచుచున్నారు)

శ్రీకృ—(దుర్యోధనునిఁ జూచి) దుర్యోధనా!

ఉ. సంధికి నైయుధిష్ఠిరుఁడు సమ్మతిఁ బంపగ గార్యమున్ భుజాఁ
స్కంధమునందు బెట్టుకొని సంతసమేర్పడవచ్చి సత్కృపా
సింధుల వారలం గలసి చెల్వుగ నుండుమటంచుఁ దెల్పసం
బంధము లేనివాని గతిఁ బల్కితి వెంతటి వెఱ్ఱివో కదా.

చ. ఎఱిఁగి యెఱుంగకో తొలుత ఽ నీవొనరించిన దుష్కృతంబులన్
మఱచిరి పాండునందనులు ఽ మాన్యచరిత్రులు, నన్ను దూతగాఁ
బరువడి సంధి సేయఁగను ఽ బంపిరి గావున వంశవృద్ధి నీ
వరయుచు సంధి జేసెదవొ ఽ యాజి యొనర్చెదవో వచింపుమా.

తే. గీ. కోపమన నేమొ యెఱుఁగని ఽ భూపమౌళి
యమసుతుఁ డల్గనేని యా ఽ యుద్ధ మెల్ల
నేక మైచనుగానము ఽ హీంత లేశ
సంధియొనరించియుందుమా ఽ సద్యశంబు.

మ. ప్రకటానర్గళ బాహుశాలియగున ఽ వ్వాతాత్మజుండున్ భుజా
గ్రకనత్క్రూరగదన్ విరోధిజనశీ ఽ ర్షశ్రేణి నేలన్ వకా
వకలై గూలఁగఁ జేయ మీ కురుకదం ఽ బంబున్ బ్రవేశింప నెం
చక మున్నే కులవృద్ధి నారసి కురు ఽ క్ష్మానాథ సంధింపుమా.

మ. సురముఖ్యాస్త్రపనీయవిక్రమము మేల్ ఽ సొంపార గాండీవమున్
గరమందన్ ధరియించి శత్రువులపై ఽ కఱ జెండఁ బార్థుండు సం
గరమున్ జేయక మున్నె యెల్ల ప్రజలన్ ఽ గాపాడఁగా వింపుమా
కురుధాత్రీశ్వర! సంధిఁ జేకురును నీ ఽ కున్ దివ్యసౌఖ్యోన్నతుల్.

మ. ఘనరోషంబున మాద్రినందనులు ది ఽ క్సంఘంబు ప్రీలన్ శరా
సనటంకారములాచరించుచు మహా ఽ జన్యస్థలిన్ వైరిసే
నను జెండాడ నుపక్రమింప నపుడే ఽ నామాటలాలించి సం
ధి నిగావింపుము సౌఖ్యముల్ గలుగు ధా ఽ త్రీనాథ చూడామణీ.

మ. సరగన్ పార్షతరాజనందనుఁడు ధృ ఽ ష్టద్యుమ్న నాముండు ము
ద్గరశూలాసిగదాకుఠారములతో ఽ ద్దర్పంబు రాజిల్ల సం
గరరంగస్థలి సంతతన్ మెలగుచున్ ఽ గౌరవ్యసేనాసము
త్కరమున్ గూల్పక మున్నె చేయఁదగుఁగా ఽ దా! సంధి దుర్యోధనా.

దుర్యో—ముకుందా! ఈయనవసరములగు మాటలేల. నాయభిప్రా
యమింతకుమిన్నె నీకుఁ దెలిపియుంటిని.

మ. వరశస్త్రాస్త్రకలావిశారదులు ద ర్పప్రాభవోపేతులు
ర్వర గాంగేయుఁడుద్రోణకర్ణులును, న శ్వత్థామయున్ వీరసం
గరరంగంబుననిల్చి రేనియెదురం గాశక్తుఁ డేరుద్రుఁడేన్
వెరపొక్కింతయునొందసుమ్మురుగుమీ వేవేగ దామోదరా.

శ్రీకృ—సుయోధనా! నీయభిప్రాయమట్లుండిన నేనేమని చెప్పుదును.

మ. ధ్వజమందున్ బవమాననందనుఁడుని ల్వన్ ముందుభాగంబునన్
ద్రిజగత్ క్షోభము సేయశక్తులగుధా తీవ్రాధులే తేర, నే
నుజయశ్రీలభియింపఁజేయరథమున్ దోలంగఁ దేరెక్కి యుం
డ్రిజుఁడాశత్రులగూల్చువేళ నొకఁడై నంగానినీస ధిమా
ట జెవిం జేర్పుఁడు చెప్పనేలకలుమా టల్ నీకు దుర్యోధనా.

దుర్యో—వాసుదేవా! నాయందనుగరుణించి నీవాప్రశంసవిడిచిపెట్టి
నాకు సెలవిమ్ము.

శ్రీకృ—మంచిది సమరమునకు సంసిద్ధుఁడవై యుండుము.

(భీష్మదుర్యోధనాదులు నిష్క్రమింతురు)

శ్రీకృ—(కర్ణునిఁజూచి) రాధేయా! నీతోఁ గొంచెము రహస్యము మాట
లాడవలసియున్నది. విదురుని మందిరము వఱకును రాఁగలవా?

కర్ణ—వాసుదేవా! వచ్చుచున్నాను.

(నడచుచున్నారు)

(తెర లేచును)

శ్రీకృ—ఇదిగో మనము విదురునిమందిరము నుప్రవేశించుచున్నాము.
ఇచ్చటనే పాండవజననియగు కుంతీమహాదేవి యున్నది. ఆమె
నుగూడదర్శించెదను. (ఇంచుక యూరకుండి) కర్ణా! నీతో నొక

పరమరహస్యము చెప్పుటకు నిటకుఁ దోడ్కొనివచ్చితిని. కుంతి కన్యకయై యుండునప్పుడు దుర్వాసుఁడొసఁగిన మంత్రబలమున నీ వామెకు ప్రభాకరునివరమున జన్మమందితివి. రాధచేఁ బెంపఁబడినకారణమున రాధేయుఁడవని పిలువఁబడుచున్నావు. కాని నీవు నిశ్చయముగాఁ బాండవేయుఁడవే. నామాటలు విశ్వసించి నీవు పాండవులకడకురమ్ము. నీవు సామ్రాజ్యమున కభిషిక్తుఁడవయ్యెదవు. యుధిష్ఠిరాదులు నిన్ను భక్తిమై సేవింతురు. ఇదియుఁగాక ద్రౌపది నిన్నాఱవభర్తగ వరించును. కర్ణా! సంశయింపవలదు. నీవు పాండవేయుఁడవని కుంతిచేతను సూర్యునిచేతను సాక్ష్యమిప్పించెదను.

(ఆకసమున నిజము నిజము)

కుంతి—(ప్రవేశించి) కుమారా! శ్రీకృష్ణునిమాటలు సత్యము ఆతని వాక్యములననుసరించి వర్తించి నాకు ముదము గొల్పుము.

కర్ణ—అమ్మా! ఈసంగతి నాకుఁ దెలియును. నన్నుగాంచి, గంగకర్పించిన నీవు నేటికిఁ బ్రేమయున్నట్లు చెప్పవచ్చితివి. అయినను బ్రభాకరుని వరమున జన్మించిన నాజన్మము నింద్యముగాక యుండు (శ్రీకృష్ణుఁ జూచి) మాధవా! కుంతి నన్నుఁగాంచి గంగలోఁబడవేసిపోవగా మత్పురాకృతసుకృతమున సూతునకు దొరికితిని. సంతతిలేకపోవుటంజేసి, యాతని భార్యయగు రాధ నన్ను నతిగారాబముతోఁ బెంచి పెద్దవానిగఁ జేసినది. నాఁటినుండియు నేను సూతుఁడననియే పిలిపించుకొనుచుంటిని. ఇప్పుడు నేనొరులవాఁడనని నేను వారినివిడిచివచ్చుట ధర్మముగాదు. ఇదియిట్లుంచుము.

మ. చతురంభోధిపరీతభూవలయరాజన్యస్వయోత్తంసనం
తతివీక్షించుచునుండ, బ్రేమమెయిన ద్రాజ్యాగ్రపీఠప్రభా

స్వితుగా నన్ను మహీశు జేసినజగద్విఖ్యాతమిత్రుం గురు
క్షితినాథున్ విడనాడఁ బాడియగునే శ్రీయంబ దామోదరా.

నేనర్జునునకుఁ దుల్యుఁడనని నమ్మియున్న దుర్యోధనుని నమ్మకవమ్ము సేయఁదగను. నేనువచ్చుట యర్జునుని యకీర్తికి గారణము. ఇఁక నా సంగతి జెప్ప నేల? ధర్మసుతుఁడు నాతమ్ముఁడనుమాట యెఱింగినచో నాతఁడు సామ్రాజ్యము నే స్వీకరింపఁడు. పరమధార్మికుఁడైన యాతఁడే రాజ్యాధిపత్యము వహింపవలయును. అనుజులు ఋత్విజులై తనకనీవు ప్రద్రష్టవై మెలంగ ధర్మజుఁడు యాజియై యొప్పుచుఁ గురుకుమార పశువిశసనమున రణయజ్ఞము సేయును. విజయలక్ష్మి యుధిష్ఠిరు సేవరించును. ఇన్నిదినములనుండియు, సూతుఁడననిపించుకొనుచు, నేనిప్పుడు వారిం జేరుదు నేని లోకులు నగుదురు. ఏయే ప్రమాణములు దుర్యోధనునికిఁ జేసితినో వానిని మఱచి ప్రపంచాధిపత్యమునైన నంగీకరింపను. నా పవిత్రజీవితమునకు మాలిన్యము గలిగించుకొనుట సమంజసమైన పని కాదు. అట్లొనర్చితి నేని, నా ధర్మవర్తనమునకును, నా పురుషార్థమునకు, గౌరవమునకు, ధైర్యసాహసములకు భంగము కలుగును. కృష్ణా! నా చిత్తము ధర్మోద్యోగమున బ్రవేశపెట్టవలదు. కర్ణుఁడు స్వామిద్రోహియని పిలిపింపవలదు. (కుంతిని జూచి) అమ్మా! నీయాజ్ఞ ననుసరింపఁ జాలకుందులకు మన్నించి, నీకొక వరము ప్రసాదింపఁదలంచితిని గాన గోరుకొనుము.

కుంతి—కుమారా! నీవట్లు బలికిన నేమనఁగలను? (ఇంచుక యూరకుండి)
వత్సా! రణమున నీయెదుటఁ బడినను, నర్జునకుఁ దప్ప దక్కిన వా
రెవ్వరికిని హాని గూర్పకుండుము.

కర్ణ—అట్లే యొనర్తును. (కృష్ణునిఁ జూచి) వాసుదేవా! ఇఁక నే పోయివచ్చెద
ధర్మమెచ్చటనుండునో యచ్చట జయముండును.

శ్రీకృ—కర్ణా! నీధర్మవర్తనకు సంతసించితిని. నీస్థిరబుద్ధి—నీపవిత్ర

తౌ—నీసత్యసంధత—నీస్వామిభక్తి—లోకమునకాదర్శకములగునుగాక.

కర్ణు—(నిష్క్రమించును.)

శ్రీకృ—అత్తా! కుంతీ! కర్ణుని సౌశీల్యముజూచితివా? ఈతఁడు మహోత్తమచారిత్రుఁడు. (ఇంచుకయూరకుండి) నేనువచ్చినపనియీరీతినైనది.ఇంకఁ జేయవలసిన దేమున్నది పాండవులకడ కరిగెదను. నీకుమారుల కేమిసందేశము తెలిపెదవు.

కుంతి—మాధవా! నీకుఁదెలియనిదేమున్నది.అయినను నాతనయులతో నిట్లువచింపుము—

మ. అతిశాంతుల్ పరధర్మసంధులతిపు ణ్యశ్లోకులైనట్టియీ
మతిమంతుల్ ధరణీరమారమణినిం బాలింపగానెప్పుడా
యతనేత్రోత్సవమొప్పుఁజూచెద మొకో యంచున్ సమస్తప్రజా
వితతుల్ మీకయివేచుచూట మనులన్ వీక్షింపుఁడీ పుత్రకుల్.

మ. అమరౌఘంబునుతింపనిందనుకభా గ్యశ్రీలనొందడి,చి
త్తములన్ శాంతివహించి నారలిఁకమీ దన్ మీవృథావాక్యవా
దముజాలింపుచు శౌర్యమేర్పడనము ద్యచ్ఛాతశస్త్రాస్త్రవా
దమువాదింపు డుపూరుషార్థులగుచున్ దైవారగాఁబుత్రకుల్

శా. చంచద్ఘోరగదాభిఘాతములచే శత్రుక్షమాపాలనాహ్వ
త్పంచప్రాణములన్ హరించిసురబృం దంబెల్లహర్షింప, న
ప్పాంచాలక్షితనాథపుత్రికపరీ భావాగ్నిజల్లార్పగా
నెంచం జెల్లునుశౌర్యమూర్తులయిమీ రీవేళసత్పుత్రకుల్.

మ. అరచేతంగలనిమ్మపండుగతివా రాడించిరిన్నాళ్లుశ్రీ
కరమున్ సర్వసుఖప్రదాకరములో కాతీతసౌందర్యగో
పురమీభారతపీఠమీరికబల స్ఫూర్తిన్ విజృంభించి మీ

కరవాలంబుల శత్రువీరశిరముల్ । ఖండించి కైకొంచు ని
ర్భరవీరవ్రతమగ్నులై చనుయశో । రాజ్యంబు సత్పుత్రికుల్.

మ. పరమాశ్చర్యనిమగ్నచిత్తులయి మీ । ప్రఖ్యాతి జేజేయు, సో
దరులీక్షించి తదీయ సాత్త్వవిమల । స్తన్యప్రభావంబటం
చరయం జేయుఁడు కీర్తిడిండిమము మ్రో । యంగా రిపుధ్వాంత లే
శ్వరరించోళి భయప్రదప్రబలతే । జస్త్రాండవుల్ పుత్రికుల్.

మ. తెగువన్ సంగరభూమి జొచ్చి మదిసం । దేహంబులన్ మాని శౌ
ర్యగరిష్ఠత్వము మీర శత్రుప్రలవ । త్యంతోగ్రజాగ్రత్ప్రభా
త్కృగణచ్ఛేదితకంకటప్రకరులం । గావించి రాజ్యంబు ము
జ్జగముల్ మెచ్చ గ్రహించినారౌనఁగుడీ । సంతోషముల్ పుత్రికుల్.

మ. అరుదొందన్ దివి దివ్యదుందుభులు మ్రో । యం గంధలోభాంధమం
ధరపుష్పంధయఝంకృతుల్ సెలఁగగం । ధర్వుల్ ముదంబార భా
స్వరమందారతరుప్రసూనవిసరా । సారంబు వర్షింప మా
ర్తురయాశ్లేషసుఖంబు ఖడ్గసుతకా । రోపింపుఁడీ పుత్రికుల్.

మ. కలనన్ వైరుల గెల్చి మీరు జయమున్ । గైకొన్నచో సద్యశః
కలనం జెందగవచ్చు వైరిజనసం । ఘాతంబుచే గూలినన్
బలభిల్లోకనివాససౌఖ్యము వహిం । పన్ వచ్చు నిందేదియో
కలితప్రజ్ఞను జేసి నాకు బరసో । కంబీయుడీ పుత్రికుల్.

శ్రీకృ — అత్తా! వీరరసపూరితమగు నీసందేశమెట్టివారికైన నుద్రేక
ముగలిగించితీరును. రణంబున నీకుమారులు తప్పక జయమం
దుదురు.

(ఆకాశమున)

శ్రీకృ—దేవతలుగూడ నాశీర్వదించుచున్నారు. భోజనానంతరమున
ప్రయాణమై పోవలయును రమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

సర్వము సంపూర్ణము.



# కంఠాభరణము
వెల రు. 1—0—0.

(గ్రంథకర్త : పానుగంటి లక్ష్మీనృసింహారావుగారు)

ఈనాటకము చదువుట మొదలిడినతోడనే చిరునవ్వు, చదువుచున్న కొలది నవ్వు, వెఱ్ఱిరామశాస్త్రిలమాటలు వినుటతోడనే పకపక నవ్వు, సుబ్బలక్ష్మి వెఱ్ఱిరామశాస్త్రిల సంభాషణము కడుపుబ్బనటుల నవ్వు. కృష్ణారావునకు రుక్మిణికి జరుగు సంభాషణము వినిన పరిశుద్ధమగు నానందము. నవాబుగారికోర్టు. రండాసాహెబువేకనవ్వు. ఇకను ఆశుకవుల దోరణి. సుబ్బిసెట్టి వట్టిపూర్తి చెప్పనక్కఱయే లేదు. ఒకసారి చదివినయెడల ఇందలి వెఱ్ఱిరామశాస్త్రిలు కనుయెదుట పాటలుపాడుచు తాండవమాడుచున్నట్లుండును. సుబ్బిసెట్టిపలుకులు, సరసము చెవులకు విందుగనుండును. ఆశుకవుల సంగ్రామహోతరంగఘోషము చెవులలో గింగురుమని మ్రోగుచుండును. రుక్మిణి సుధామధురాలాపములు మనసునకు చక్కని నీతినిబోధించుచుండును పాలపొంగువలె ఒక్కసారి వచ్చునవ్వు తెరకాదు. మేలుగులాబియత్తరువలె స్వచ్ఛగంగోదకమువలె చారుశారదపూర్ణిమాచంద్రబింబమువలె ఆనందజనకముగ మనోహరముగ నుండును.

# రాధాకృష్ణ.
వెల—రు 0—10—0.

(పానుగంటి లక్ష్మీనృసింహారావుగారు)

చక్కని చిన్న నాటకము. రాధకును, శ్రీకృష్ణునకు గలప్రేమ జీవాత్మకును, పరమాత్మకును గల యాధ్యాత్మిక సంబంధమువంటిది కాదని ఈనాటకము బోధించును. శారదుని హాస్యప్రసంగములు ఆనందజనకములు. ఈనాటకము చదువుచుండగా కలియుగముమాటయు రచి నా శాంతముమరచి మరచి నాదైన పురుషజన్మంబుకూడ నింతగా నేనురాధికా శాంతనైతి. భక్తిరసప్రధానమైన నాటకరాజము.

వలయువారు— కందుల గోవిందం,
బెజవాడ.

# బిల్వమంగళ అను చింతామణీనాటకము

ఇది శ్రీచళ్ళావధానుల మాణిక్యశర్మ గారిచే రచియింపబడినది ఇందు పాద్యక గ్రాటకమట్లుగూడకలవు ఇందు శ్రీవారియొక్క విటకాడగు కామశాస్త్రి బిల్వమంగళునకు చింతామణిని చూపు బిల్వమంగళుడు మోహించుటయు బిల్వమంగళుడు ఇంటికివెళ్లకుండా చింతామణిదగ్గిర నేవుండుటయు యింటివద్ద తండ్రియగు రామదేవమూర్తి విచారముతో మంచముపట్టుటయు బిల్వమంగళుని భార్యయగు శాంతమామ గారికి వుపచారములు చేయుటయు బిల్వమంగళుని దగ్గిరకు భార్య అనేక జాబులంపుటయు చింతామణి బిల్వమంగళుని ఇంటికివెళ్ళమని చెప్పుట బిల్వమంగళుడు ఇంటికివచ్చుట తండ్రి విచారముతో బిల్వమంగళుని చూచి వేశ్యయగు చింతామణి యింటికివెళ్లవద్దని చీవాట్లుపెట్టుట నేను మానని బిల్వమంగళుడు చెప్పుట తండ్రి విచారముతో మరణించుట అప్పుడు ఆకాశమంతయు మేఘముతో నిండియుండుటయు యెద్పుటనో పిడుగుపడుటయు చింతామణి ఇంటిమీదపడి నేమోయని బిల్వమంగళుడు తలంచి తండ్రి శవము యింటివద్ద నుంచి చింతామణి యింటికి అర్ధరాత్రికాలమందు పోవుటయు భార్య వెళ్ల వద్దని బ్రతిమాలుటయు ఆమెమాటలనిరాకరించి వెళ్లుటయు ఇట్పుటరుటువంటి వారైనను కంటతడిపెట్టకమానరు భార్యయగు శాంత నేను బ్రతికి యుండి యెందుకని యేటిలోబడుట బిల్వమంగళుడు అశవమునే నావగాభావించి ఆవలకు దాటుట చింతామణి యింటికి వెళ్ళేసరికి తలుపులన్ని వేసియుండుట గోడదూకి చింతామణి యింటిలో బ్రవేశించుట చింతామణియింతఅర్ధం త్రివేళ వచ్చినావేమని బిల్వమంగళుని అడుగుటయు నీమీద పిడుగుపడినదేమోయని భయపడివచ్చినానని చెప్పుటయు చింతామణి బిల్వమంగళునకు నీతిచెప్పుట చింతామణికలలో కృష్ణుడు ప్రత్యక్షమవుట చింతామణి కులవృత్తి మాని వైరాగ్యముతో వుండుట బిల్వమంగళునకు నీతిచెప్పుట బిల్వమంగళుడుకూడ యోగివేషముతో శ్రీకృష్ణునిజన్మస్థానందగ్గిరకువెళ్లెదనని చెప్పుట చింతామణి యోగులలో కలియుట బిల్వమంగళుడు శ్రీకృష్ణుని దగ్గిరకువెళ్లేటప్పుడు వకఉద్యానవనములో వకరాజుభార్యనుజూచి మోహించుట ఆరాజుభార్య బిల్వమంగళుని ఇంటికి తీసుకువెళ్లి అనేకమైన నీతులు చెప్పుట యీపాడు నేత్రములెందుకని బిల్వమంగళుడు కళ్లుపొడుచుకొనుట శ్రీకృష్ణుడు నారదునకు గర్వభంగము చేయుట చిత్రవిచిత్రముగ వ్రాయబడిప్రకటించబడినది కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడిన గానిదొరకనేరవు

వలయువారు:—

కంపాల గోవిందం,

బెజవాడ.